# నీతిధర్మము.

మహాత్మాగాంధి విరచితము.






భమిడిపాటి సూర్యనారాయణశాస్త్రి గారిచే
పరివర్తింపబడినది.



ప్రకాశకులు:

## ఆంధ్రపరిషత్తు, బెజవాడ.

బెజవాడ
ఆంధ్రగ్రంథాలయ ప్రెస్ (లిమిటెడ్) యందు,
క. కోదండరామయ్యచే ముద్రింపబడియె.

**1922.**

 [వెల రు 0-4-0.

# గాంధిమహాత్ముని సంపూర్ణ జీవిత చరిత్ర.

మానికొండసత్యనారాయణ శాస్త్రిగారిచే వ్రాయబడినది. గాంధిమహాత్మునిశిష్యులగు దిగుమర్తి హనుమంతరావుగారిచే, వారిఅనుభవములతో గూడినవిపులమగు ఉపోద్ఘాతము వ్రాయబడినది. ధోవతిమాత్రముధరించినపటముఇందుగలదు. వెల ౦-౮-౦

# గాంధిమహాత్ముని ఆరోగ్య మార్గబోధిని.

విపులముగ వ్రాయబడినది. సంకుచితముగా వ్రాయబడినదిగాదు. పెద్దఅచ్చు. ఆంధ్రభాషా పండితులగు భమిడిపాటి, సూర్యనారాయణగారిచే సులభశైలిని వ్రాయబడినది. వెల ౦—౮—౦. రెండు రకములైనపటములిందుగలవు.

# గాంధిమహాత్ముని సంపూర్ణ ఉపన్యాసములు వ్యాసములు.

దక్షిణాఫ్రికాలో భారతీయులకొరకు పాటుపడుటకు ప్రారంభించినది మొదలు అహమ్మదాబాదు కాంగ్రెసువరకు, సంపూర్ణ ఉపన్యాసములును, వ్యాసములును ౩ భాగములుగ ప్రకటించుచున్నాము. ౩ భాగములు కలిపి సొమ్ముముందుగా పంపించినయెడల, రు ౩—౦—౦లు మాత్రమే. ఈభాగములు తయారుకాగానే ఖరీదు హెచ్చును.

వలయువారిట్లువ్రాయవలెను:—

ఆంధ్ర పరిషత్తు, బెజవాడ.

# నీతిధర్మము.

మహాత్మాగాంధి విరచితము.



భమిడిపాటి సూర్యనారాయణశాస్త్రిచే

పరివర్తింపబడినది.

ప్రకాశకులు :

## ఆంధ్రపరిషత్తు, బెజవాడ.

బెజవాడ ఆంధ్రగ్రంథాలయప్రెస్ (లిమిటెడ్) యందు,
క. కోదండరామయ్యచే ముద్రింపబడియె.

1922.

 [వెల రు ౦-౪-౦.

# విషయసూచిక

# మోహనదాసు
# కరంచందు గాంధి మహాత్ముఁడు

జి. హెచ్. హ్యూమ్సుగారి ప్రశంస.

నేఁడు ప్రపంచమున సర్వోత్కృష్టమానవుఁ డెవఁడను నామోదదాయకప్రశ్నమునుగూర్చి నేటియుదయము మీకడ బ్రసంగింపఁబోవుచున్నాఁడను. ఈప్రశ్నమున కుత్తరము నరయుటకు మహాయుద్ధము జరిగినకాలమునకు మన మనస్సుల స్వభావజన్యముగ బోనిచ్చి ఆ ఘోరరణమున నపారబాధ్యతాశక్తుల న్యాకసమునఁదిన మహనీయుల నామపట్టికపైఁ బ్రసరింపఁజేతుమని నే నూహించుచున్నాఁడను. 1919 సం॥రము ప్రారంభమాసములలో ప్యారిసునగరమున యుద్ధనాయకుల మహాసమావేశమునుగూర్చి మనమూహింతుము. రెండు సంవత్సరములక్రిందట నీకాలమున ప్రపంచకమంతలోను సర్వోత్కృష్ట మహాపురుషుఁడెవఁడయిన నెచటనేని యుండునెడల నీ మిత్రసామ్రాజ్యములయందలి రాజకార్యధురంధరులగు ప్రధానపురుషుల సభాసమావేశముననే యుండెనని మనమెల్లర మేకగ్రీవముగ నంగీకరించి యుండువారము. ప్రపంచకనాగరికత కుపద్రవకారియని భీతికలిగించిన యుపద్రవమువలన పరిశోధింపఁబడినట్టియు నా మహాపద్రవమునుండి మిగుల నాకస్మికమును సంపూర్ణమునగు జయమును పొందినట్టియు మహనీయులు వీరలె. శాంతి ప్రజోపకారిగ నెట్లుచేయునగు

నవగా యుద్ధానంతరలబ్ధవిజయము మానవశ్రేయోవృద్ధిదాయకముగ జేయుటెట్లను మహాసమస్యను వారు పరిశోధింపఁబడుచున్నారు. పరిశోధనయుులలో కఠినతమమగు నీపరిశోధనము నవే వివిధ దేశనాయకు లసమర్థులని విదితమయ్యెను. వార్సేల్సునగరమున జరిగినదానిని గమనించిగాని అందు ముఖ్యముగ నాయొడంబడిక సంతకములయినదిమొదలు జరుగుచున్నదానిని బట్టిగాని యీశాంతి యనెడు మహాకిల్లోలమునకు కారకులయిన వారిలో నెవ్వరుగాని యథార్థముగ ఘనతకు స్థిరముగగాని ముఖ్యముగగాని యర్హులుకలరని యెవ్వరు దెలుపగలరు? రెండు సంవత్సరములకు ముందీశాంతి పరిషత్సమావేశము నలంకరించినవారిలో నొక్కడె కీర్తికి విశేషభంగము లేనివాడును, ననపహార్యయశస్సంపూర్ణుడు నని నాయభిప్రాయము. ఆయన దక్షిణాఫ్రికా ప్రధానమంత్రియగు స్మట్సుసేనాని. ఈమహనీయునిగూర్చి వాల్టరులిపమన్‌గారిట్లు వర్ణించియున్నారు. వార్సేల్సునగరమున నద్దాలమేడలో (Hotel of Mirrors) నొడంబడికపయిని సంతకములు చేసిన వారిలో నితడుమాత్రమె యుద్ధమున నిజప్రతిబింబదర్శనమాత్రమున దృష్టిఁజెందక మానవజాతినంతను గమనించెను. స్మట్సుసేనానియొక్క పరిషత్సమావేశమునందలి ఘనతను దెలియగోరుదురేని యీక్రింది మూడుపత్రములను బఠింపుడు.

అందొకటి యతఁడు బహిరంగముగ బ్రకటించిన యొడంబడికకు కారణ నిరూపణము; రెండవది లండనునుండి జోహా

న్యూబర్గునకు బ్రయాణసంసిద్ధుఁడగుతఱి బ్రకటించిన యైరోపా ప్రజలను వీడుకోలు; మూఁడవది గతమార్చి నాల్గవ తేదీని విల్సను ప్రజానాయకుఁడు తనపదవిని విడచిపోవు సందర్భమున నాయకునకు స్తుతిపాఠాభివందనము. స్మట్సుసేనాని మిగుల శక్తి యుక్తులతోడను చెక్కుచెదరని యాదర్శకావేశముతోడను రణక్రీడ సలిపెను. యుద్ధరంగమున జయశీలుఁడగుతఱి శత్రువుల క్షమించుచు రక్తసిక్తదేహులగు పరసైనికుల గాయముల మాన్పయత్నించెను. సభాభవనమున తన మాటచెల్లని నాఁడు తనయోటమి తన భావములయందలి శుద్ధత లేకుండుట కతముననే యని యంగీకరించి తాను నివారింపఁజాలని నష్టమునకు పరిహారము గావింపయత్నించెను. స్మట్సుసేనాని మహాఘనుఁడు. గత మహాసంగ్రామమున హతశేషులలోఁ నిప్పటికిని మిగిలియున్న యేకైక మహావీరుఁడాతఁడె. కొంచెముకాలము విజయశోగానములచే లోకరంజనము గావించిన యితరనాయకుల నెల్లర లోకులు విస్మరించియేయుండిరి. విస్మరించుచున్నారు. మఱల నెన్నఁడును వారు లోకగౌరవ పాత్రులగుదురని తోచదు. గిల్బోవా పర్వతముకడ జరిగిన యుద్ధానంతరమున, "బలవంతు లెట్లు రణనిహతులయిరి? యుద్ధాయుధములెట్లు నశించినవి? యని దావీదు పలికి యుండినటుల మనమును చెప్పవలసియున్నది. మహాసంగ్రామమను తుపానునుండియును, దానికతమున నధికారోన్నత్యస్థితిని పొందిన యోధులనుండియును విరమింతును. నేఁడు ప్రపంచమునందు జీవించియుండిన జనులలో ఘనతముఁడని నామనము నాకర్షించిన పురుషవరుని

కొరకన్యత్రి యరసిచూచెదను. ఈయుత్తమస్థానాలంకారార్హులును, భిన్నోత్పత్తిశీలసంపన్నులునగు ముప్వురు మూర్తులు నాకు తత్క్షణమె స్ఫురించుచున్నారు.

జీన్‌క్రిస్టఫీ యను చిరకాలస్థాయియగు నవలకు గ్రంథకర్తయు, ఫ్రాన్సుదేశీయుఁడును నగు రొమెయిను రోలండు నే బేర్కొనువారిలో ప్రథముఁడు. ఈమహనీయుఁడు మహాసంగ్రామకాలమున శాంతిబోధకతమున స్వదేశబహిష్కారశిక్ష విధింపఁబడెను. యుద్ధానంతరము ప్రస్తుతి సంధిసమయమున నీతఁడన్యోన్య జాతీయ మిత్రతాబోధకులలో నగ్రగణ్యుఁడు. కార్యనిర్వహణధురంధరతకంటె నున్నతాదర్శమూలమున నీ రోలండు మహనీయుఁడుగ నున్నాడు. లియోటోలిస్టాయి యను నతని శీలమును చెల్లుబడియు నతనియందు సంక్రమించి యుండెనని యేననిశము దలంచుచుందును. దీనినిబట్టియె యీ రోలండుయందు నాకుగల గౌరవము వ్యక్తముకాగలదు. లియాటోలిస్టాయికిగల పౌరుషగౌరవము లింకొకనికి సంక్రమింపనేరవు. పందొమ్మిదవ శతాబ్దమునకంతకును నాతఁడొక్కరుఁడే నీతిమార్గదర్శకుఁడై ప్రకాశించియుండెను. టోలిస్టాయి వలెనే యీతఁడును మిగుల తీక్ష్ణమగు మనోబలముతోఁగూడ సౌమ్యమును యాత్మశక్తియును కలిగియుండెను. టోలిస్టాయివలెనే నీతఁడును నైతికాధ్యాత్మికయుక్త మహోన్నతభావ ప్రపంచముననే సర్వకాల సర్వావస్థలయందును వర్తించుచుండువాఁడు. ఆప్రపంచమున ప్రేమయే మానవజీవితోత్కృష్ట ధర్మము. మరియు నన్యోన్యమైత్రియే ధర్మాచరణము.

యుద్ధమునకు పూర్వము యీమహోపద్రవము రాగలదని గ్రహించి యది రాకుండ తనయావచ్ఛక్తిని వినియోగించిన యల్పసంఖ్యగల మహనీయులలో నితఁడొకఁడు. ఖండమునందలి కవిగాయక శిల్పకళాప్రవీణులకెల్ల దన యాశయమును దెలియబరచెను. యౌవనోత్సాహపూరితులగు వారెల్లరు శిష్యులు గురువుకడమూగిన ట్లాయన నాశ్రయించిరి. ఉన్నతాదర్శగర్భితములగు పాపవాతావరణముల సమకాలికములగు జాతీయాన్యోన్య యీర్ష్యాద్వేషములు నశించునని యాతఁడుద్దేశించియుండెనో యామార్గముల వారి నడిపింపయత్నించెను. జీన్‌క్రిస్టఫీయను నవలను కేవలకావ్యరచనాసక్తిచే [illegible] దేశముల యన్యోన్యజ్ఞానాభివృద్ధిఁగాంచియీ రెండుదేశముల పరస్పరసంబంధమును వ్యక్తపఱచుటకే వ్రాసెను. యుద్ధప్రారంభము కాగానే వాడు సాధారణముగ యుద్ధములలో మొదట నశించునట్టి యాధ్యాత్మికభావముల సంరక్షించుట తన విధ్యుక్తధర్మమని భావించెను. యుద్ధము మానవహృదయమును పరిశుద్ధముగావించునని కాని లేక శాశ్వతముగ వానినీతిమార్గప్రవర్తులుగ జేయునని కాని యాసపడి యాతఁడు మోసపోలేదు. తక్కిన యుద్ధములవలె నిదికూడ క్రూరమయి ఘోరమయి మానవజీవితమున యోగ్యమై పరిశుద్ధములగు సర్వమును ధ్వంసముచేయునని యాతఁడెఱుఁగును. కావుననే మానవసేవగావింపఁ బద్ధకంకణుఁడయి యాధ్యాత్మికతేజమును నశింపకుండ కాపాడి యుద్ధానంతరమున మానవజాతిని సర్వస్వము గోల్పోయినవానిరీతి గాఢాంధకారమున సంచరింప

ఖండ కాపాడెను. ఈ ఘోరమహాసంగ్రామానంతరము నేడు రోలండు తిరుగ జాతీయభ్రాతృభావమును నెలకొలుపుచు న్నాడు. జనులందరు తమ యస్త్రశస్త్రములవిడిచి విదేశసహాన విషదూరములుగ తమ హృదయముల గావించుకొనుచు, యుద్ధములుగాని యుద్ధవార్తలుగాని వినఁబడకుండునట్టి భగవత్సామ్రాజ్యము నీలోకమున నెలకొల్పుటయే యామహానీయుని మహాదాశయము.

పరిష్కృత మైరోపాఖండమున నాగరికత యేమాత్రమయిన నిలచి యుండెనేని ప్రస్తుతమగమ్యాగోచరముగ నుండు గాఢాంధకారబంధురలోకమున నొకింతయేని నైజ తేజవ్యాప్తి కలిగియుండెనేని, పరిష్కృత ప్రపంచభవిష్యదభ్యుద్ధి సూచకములగు మనోరథము లెన్నఁటికయిన సఫలత గాంచు ననెడి యాశ యొకింతయేని నిలచెనేని, యా యశము పోక్లెమెంకోలకీను, లాయడ్ జార్జి వుడ్రోవిల్సనులకును, యీపాడు యుద్ధమును శ్రేయోదాయకముగ జేయ వ్యర్థప్రయత్నములం గావించిన మరియేరికిని జెందక రోమెయిను రోలండునకే జెందునని నావిశ్వాసము. రోలండు తనయాదర్శముల యెడ దృఢవ్రతుఁడుగ నుండెను. వానిని నిర్దుష్టముగు ధైర్యముతో నిత్యాచరణమున నుంచువాడు. ఈ యాదర్శకములవలన నతఁడు గావించిన సత్కార్యము లాతని నధ్యాత్మక జ్ఞానులలో నగ్రగణ్యుఁడను కీర్తికలిగెను. అతఁ డేవిషయమునసయిన కొరవడి యుండునెడల నాకొరత లౌకికవ్యవహార సంచయమున మాత్రమే.

అతఁ డావిషయమున దప్పక కొరత జెందెనని నా తలంపు. ఈ విషయమున నితఁడు సమర్థుఁడుకాఁడు. కాని యతఁడందు బ్రవేశించియే యుండలేదు. ఏలనన రోలండు కవియు జ్ఞానియును మిగుల నభిమానియును సుకుమారుఁడునుగ నుండెను. కాన నతఁడు జనసామాన్యముతో పాటు వర్తించు ననుట దురూహ్యము. ఆయన విప్లవనాయకుఁడుగాని ప్రపంచకౌన్నత్య సంపాద్యమునకై మహాజనసంఘనాయకుఁడుగగాని, నవీనసాంఘిక రాజకీయసంస్థల నిర్మాతగగాని యాయన యెన్నఁడునుండలేదు. రోలండు, టాల్‌స్టాయివలె బుద్ధిపూర్వకముగ గాక స్వభావజన్యముగనే యుద్ధవిముఖుఁడుగ నుండవలెను. కాని రణరంగమున రక్తసిక్తఘోరదర్శనుడుగ నుండజాలఁడు. ఏలనన రోలం డాదర్శకావేశితుఁడుగాని క్రియానిపుణుఁడు గాఁడు. భూమికి బహుదూరమున నూర్ధ్వమున నతితేజోవంతముగ వెలుగు నక్షత్రమువలె మార్గదర్శకుఁడుగను నారాధనార్హుఁడుగను నతఁడు నాకు గోచరించును. ఇతరులు నిస్తేజములును ధూమావృతములునయి మానవాభివృద్ధిమార్గము నతిభయావహముగ గనబరచు దివిటీలను బోలియుందురు.

లోకాతీతశక్తులుగల సత్యమును దెలుపు సందర్భము నింతటితో విరమించి నేటియుదయమున నేదెలుపఁ బూనిన రెండవ మహాపురుషునిగూర్చి ముచ్చటింతును. సోవియట్లు ప్రజాప్రభుత్వప్రధానుఁడును, ప్రపంచమున నిప్పటికున్న యితరుడెవ్వనికంటె నధికమగు యాత్మశక్తి

యుక్తుఁడును, రష్యాదేశీయుఁడు నగు నికోలెలెనిన్ మహా మహునిగూర్చి నే జెలుపఁబూనితిని. ఆకాలపు ఘనులలో నీయనపదవి సెన్నుటకో తనప్రజలలో నాతఁడొనర్చిన కార్యమ్ములను గూర్చిన దురభిప్రాయము లేవయిన గలిగినయెడల వానిని మనము నిర్లక్ష్యముచేయుట యగత్యముగనున్నది. ఆయన పథకములు యోగ్యములనియు, నాతని రాజకీయాలో చన లుపద్రవకరములనియు, నాయనకార్యజాలము నాగరికతా విధ్వంసహేతుకమనుట మనమనుకొనవచ్చును. కాని యాయభిప్రాయము లాయన శక్తియుక్తుల నించుకేని బాధింపఁకూడదు. బాధింపఁజాలవు. ఇందుకు దృష్టాంతరముగ నెపోలియన్ బోనపార్టినిగూర్చి లోకమున స్థిరయశస్సాంద్రుడనియు, మానవచరిత్రమున మిగుల దుఃఖభాజనములగు కార్యజాలము నాతఁడు గావించియుండెననియు ననేకులు వర్ణించియున్నారు. ఆతని పౌరుషోన్నతిని గూర్చి హెచ్. జీ. వేల్సు గారి సంక్షిప్త ప్రపంచకచరిత్రమునదక్క మరి యెవరును నిషేధించి యుండలేదు. అట్లే నికోలైలెనినుగారినిగూర్చియును. అయినను లోకమున జీవించియున్న పరమదుర్మార్గుడయిన మహారాక్షసుఁడనినను యనవచ్చును. కాని యాయన ఘనత కెంతమాత్రము భంగమురానేరదు. అతని సమకాలీనులకు నాతనికిని హస్తిమశకాంతరము గలదు. ఆకాలమున నతఁడు ప్రపంచజీవితకేంద్రముగ నుండెను. బండియిరుసు చుట్టును చక్రముతిరుగున ట్లాతనిచుట్టును లోకవ్యవహారము లన్నియు బరిభ్రమించుచుండెను. ఇపుడు మనము ఎలిజెబెత్

యుగము – పదునాల్గవ లూయీయుగమనునట్లు మహాసంగ్రా
మానంతరమున నిక్కాలమును లెనినుయుగమని భవిష్య
చ్చరిత్రకారులు వర్ణింతురను దృఢవిశ్వాసము నాకు గలదు.

అనన్యసాధారణమగు నాయన మహాఘనత కాయన
నెఱిఁగినవారును నాయనను చక్కఁగ బరిశోధించినవారును,
వెలుపువిషయములే నిదర్శనములుగ నుండును. విగ్రహ
పుష్టి బొత్తిగ లేకుండుటచే నాయనను చూచినవారు ప్రథమ
సందర్శనమున నాయనఘనతను తెలియజాలరు. ఆయన
వీరుఁడువలె గనఁబడఁడు సరిగదా పీడునివలె ఒక్కుఁగ నడవ
కుండెను. ఆ మహనీయుని ఘనతనెఱుఁగఁజాలని పలువురితో,
పాటు వెల్సుగారుకూడ నాయననుగూర్చి "పెద్ద దసుకుబల్ల
కడ నాసీనుఁడగు చిన్నమనుజుఁ"డని వ్రాసియుండెం. బ్రెట్రెండు
రిస్సెలుగా రాయనను "మిగుల స్నేహపాత్రుఁడును, నిగర్వ
చూడామణియనియు, సాధుమూర్తియనియును, ఆయన నెన్న
డెఱుఁగనివారు చూడదటస్థించునెడల నాయన శక్తివంతుఁ
డును ఘనుఁడునని యెంతమాత్ర మూహింపఁజాలరనియు
యింత దంభరహితుఁడగు ఘనునెన్నఁడును గాంచియుండలేదని
యును" వర్ణించియున్నారు. లెనినుగారి యాకృతియందు మననా
కర్షించునది యద్భుతజ్ఞానసంపన్నమగు పెద్దతలయొకటియె.
కేరుషెరిడను దొరసానిగారు నిర్మించిన యాయనవిగ్రహము
యొక్క విశాలఫాలమును బరికింప షేక్స్పియరు మహాకవి
వరుని శిరోభాగము మనకుస్ఫురించును. ఇదితప్ప లెనిను
గారి యాకృతి యితరవిధములచే మన నాకర్షింపజాలఁదు.

అతఁడు మహావినయసంపన్నుఁడు.

లెనినుగారిని దర్శించినవారెల్ల రాయన మహాఘనుఁడని యంగీకరించియున్నారు. బోల్షివిస్టు పరిపాలనా పక్షావలంబియగు నార్థరు రాన్ సమ్మానును నాయన యీయన నకాలపు మహాఘనులలో నొకఁడని చెప్పుచున్నాడు. ప్రకృతమున బోల్షివిస్టు పరిపాలనా ప్రతికక్షియగు బెర్ట్రెండురస్సలుగారు లెనిను మహాశయునిగూర్చి మహాఘనుఁడని నిరాఘాటముగ బలుకుచున్నారు. ఆయతో శత్రుమిత్రత్వములు లేని మాధ్యస్థుఁడగు రేమండురాబిన్సుగారు సోవియటుప్రధానుఁడగు లెనిన్ గారు రైరోపాఖండమందలి రాజనీతికోవిదులలో నగ్రగణ్యులని" నుడువుచున్నారు. ఆయనను దూరమునుండి చూచువారుకూడ నాయన ఘనతను మెచ్చుకొనుచున్నారు. ఇందుకు తార్కాణముగ ఫ్రాంకు వాండర్లిప్పుగారు "లైనినుగారసాధారణ ప్రతిభాశాలిగ తమకు గోచరించుచున్నా" రని వ్రాసియుండిరి. బోల్షివిస్టుపాలనకు మిత్రుని దెలుపనవకాశము లేని న్యూయార్కుటయిమ్సుఅను వార్తాపత్రికయందలి వ్రాతనిక్కడ క్రోడీకరించుచున్నాడను. లెనినుగారి మరణమునుగూర్చి పలుమారు బ్రకటింపబడిన వివిధకాలములలో నొక మారజాగ్రతగా లెనినునుగూర్చియిట్లు వ్రాయుయఁబడినది. "ప్రపంచమహాసంగ్రామమున జగద్విదితులగు మహనీయులలో లెనినగ్రగణ్యుడు."

నిక్కలై లెనినుగారిని జూచినవారును నాయననుగూర్చి చదివినవారును నాయననిట్లు శ్లాఘింపకారణ మాయన గత మూడువత్సరములలో నొనర్చిన మహాద్భుతకార్యముల స్మర

లాడొ నిస్సంశయముగ నయియున్నది. ఆయన కార్యములు చరిత్రములలో సాటిలేనివిగ నున్నవి. రష్యాదేశపు బాహ్యాభ్యంతర శత్రువర్గముల దాడికల్ల రణరంగముల తాన యెదురుకొని పారదోలెను. సైన్యము వెంబడి సైన్యము మాస్కో నగరమున ముట్టడింప యత్నించెను. కాని క్షుద్బాధా పీడితులగు ప్రజలతో గూడినట్టియు సాధన సామగ్రులులేనట్టియు నాయనచే నడుపఁబడిన యెర్రసేనలు (Red armies) అంతఃకలహాభరితమగు దేశమున జయమును గాంచినవి. ఫ్రాన్సు దేశపు విప్లవసమయమున దేశనాయకులగు, రోబ్సుపియరీడానను, మారటుగార్లతో నిపుడు లెనెనుగారిని సరిపోల్చిచూచుట యాచారముగనున్నది. కాని నిజముగ నీయనను నైరోఘాఖాడమందలి సేనలనన్నిఁటిని జయించినట్టియు విప్లవసమయమున సేనల సమకూర్చినట్టియు యుద్ధమంత్రియగు కార్నాటుగారితో సాటిచేయవచ్చును.

మఱియును యుద్ధపర్యవసానముగ రష్యాదేశమునకు భీతిగలిగించిన కలిగించుచున్న నాగరికతానాశనమునుండి లెనెనుగారును వారి సహచరులును, దానిని కాపాడిరి. సాధారణముగ మనమనుకొనుదానికిది వ్యత్యయముగనున్నది. ఏలనన ప్రస్తుతము రష్యాదేశమున బ్రతిచోటను వ్యాప్తిలోనున్న సాంఘిక ప్రళయమును మానవదుఃఖమును యీబోల్షివిష్టు పరిపాలనవలన కలిగినవని జనులలో ననేకులు నమ్ముచున్నారు. ఇంతకంటె సత్యవిరుద్ధపుసంగతి మఱొండెద్దియును నుండదు. బోల్షివిక్కుల కధికారస్థానముల నాక్రమించుటకు

తొమ్మిదిమాసములకుమున్న జారనెడు రష్యాచక్రవర్తి గారి సామ్రాజ్యము నిజదౌర్బల్యకారణమునను, పాపముపండియుండుటను, ధ్వంసమయియుండెను. గడచిన మహా సంగ్రామ మట్లుద్దేశింపఁబడియుండకపోయినను నాగరితా విధ్వంస హేతువుగ బరిణమించినవి. ఈయుద్ధముకతననే రష్యా సామ్రాజ్యవిధ్వంసము సంభవించినది. 1917 సంιιరమున రష్యాకుతటస్థించిన దురవస్థయే యీ మహాసంగ్రామ మింకొకవత్సరకాలము సాగియుండునెడల ఫ్రాన్సుకుకూడ పట్టియుండును. అదియు మఱి నాలుగయిదు వత్సరములు సాగుచో గ్రేటుబ్రిటను పాటును నంతియు కాగలుగును. మిగుల దరిద్రావస్థయం దుండుటవలనను, ధనికహస్తగతమై ప్రభుత్వముండుటవలనను, రష్యాదేశము విచ్ఛిన్నమాయెను. జారు చక్రవర్తిగారి తరువాత రాజ్యముచేయు విప్లవకారులగు ప్రభుత్వమువారు పరిపాలనాదక్షత చాలమిని హతాశులయిరి. పిమ్మట కిరన్సికీగారు రాజ్యముచేసిరిగాని యాయనకూడ నసమర్థుడయ్యెను. పిమ్మట లెనినుగారి పాలన మారంభించెను. ఈయన కూలిపోవుచున్న సామ్రాజ్యభవనమును నిజభుజాదండమున నిలిపి యిప్పటికిని పడిపోవకుండ కాపాడుచుండెను. రష్యాదేశమున గందరగోళముస్థితి లేకుండుటకును, నాదేశమునందలి పెద్దపట్టణములు జనశూన్యములు గాకుండుటకును నినువదారులకు తుప్పు పట్టనీయకుండుటకును, జనులు స్వోదర పోషణమున్నకై పశ్చిమదేశములకు గుంపులు గుంపులుగ వలసలు పోవకుండ జేయుటకును, సర్వమునకును నికో లైవెనినుగారే

కారకులు. ఇట్టిస్థితికి ప్రపంచమందలి మరియేమనుజుండును కానేరఁడు. రష్యాపరిస్థితులే యూరోపాపరిస్థితులని హెచ్. జీ. వెల్సుగారి యభిప్రాయమే నిజమగునెడల లెనినుగారు ధ్వంసకుఁడు కాడనియును, స్మరింపఁబడుకాలము రాగలదని నే ప్రవచింప సాహసించెదను.

లెనినుగారి ఘనకార్యముల నాలోచించునపుడు రాజ్యాంగవిధానమున నాయన నిర్మాణకౌశలము మనకు గన్పట్టును. సాధారణసందిగ్ధస్థితిలోఁగూడ నాయన సాంఘిక జీవనమును నూతనార్థికవిధానము నొకదానినేర్పరచెను. ఆయన సోవియట్టను నొక నూతనసాంఘికసమస్తు నెర్పరిచెను. ఆయన దివ్యదృష్టిచే నొకనూతన సాంఘికాదర్శమును గాంచెను. అది పాటుపడువారి ప్రజాస్వామ్యము భావనామాత్రమునుండి సామాన్యప్రజాస్వామ్యమును నాచరణయోగ్యమగు నవీనవిధానక్రమమును నిర్మించెను.

మహాకర్మదక్షునికార్యము లియ్యవి. లెనినుగారే విషయమునందేని కొరవడియుండునెడల నాకొరత నైతికాదర్శకమునందేయుండును. ఆయన యావిషయమున దప్పక కొరతజెందియుండెననియే నా నిశ్చయము. ఆయన శీలమున పూర్ణుఁడయ్యెను. నైతికాధ్యాత్మిక ధర్మభావనాశూన్యుఁడుగ నుండెను. ఆయన తాను మతవిహీనుండనని తెలుప గర్వించును. కాని భౌతికజీవనముతోడ నాతఁడు తృప్తిజెంది యుండెను. తానంగీకరింప యుక్తమనిగాని, యగత్యమనిగ ని యెంచు నీతిధర్మమెద్దియు నాయన లేదనుచుండును. నీతిపథకములకు

మాన్యముగ నెంచబడుచు, బుద్ధిశాలురెల్ల రవలంబింపవలెనని చెప్పఁబడువది ధనవంతులును, బలవంతులును, తమసొత్తును స్వాతంత్ర్యములను సురక్షితము గావించుకొనుట కనాలపయిని కృత్రిమముగవిధించిన కపటసూత్రములని యాతఁడ నెంచుచుండెను. పాటుపడువారు తమతో పనిచేయువారి కుపయోగమయిన యేకార్యముచేసినను నది మంచిపనియని లెనినుగారి యోచనామార్గము. ఈ విధముగనే పనివాండ్ర స్వాతంత్ర్యములకు భంగకారియును నాలస్యసంధాయకము నగు యేకార్యమయినను చెడ్డదేయగు. కార్మికనాయకుఁడుగను, సోవియట్టు ప్రభుత్వకార్యనిర్వాహకుఁడుగను నాయన రణరంగమునందువలె నావశ్యకవిషయములనే యాచరణమం దుంచుచుండెడివాఁడు. అనగా యుద్ధభటుఁడు శత్రువిజయముగాంచి, జయలక్ష్మికరగ్రహణమున కవసరమగు కార్యముల నెట్లొనర్చుచుండునో యామహాశయుఁడుగూడ నట్లే గమనించుచుండెను. కార్యసిద్ధియగునా డీయుపకరణములయోగ్యత బయల్పడును. ఉపకరణము లేవియయినను కార్యసిద్ధియె ప్రధానము. లెనినుగారు మానవరక్షణను, సంఘదోషవిముక్తిని నిర్వహింప పాటుపడుచుండెను. ఈకార్యసిద్ధి కవసరమగు నేసాధనములయినను కార్యసిద్ధిసంప్రాప్తిమగువరకు సమంజసములై లెనినుగారి జీవితమునందలి విపరీతములును నసాధారణములు నగు కార్యాచరణముల కీదృక్పథమే కారణము. ఈవిధముగ లెనిన్‌గారు ప్రజాస్వామ్యవాది. కాని మనుష్యజాతి యెన్నఁడెఱుఁగని నిరంకుశప్రభుత్వమును

నాయన నిర్వహించుచున్నాఁడు. అతఁడు భయముకలిగించువాడు కాడు. కాని రష్యాదేశమున నారువారములవరకు రక్తవస్త్రధారులగు నిజసేనాసముదాయమువలన మిగుల క్రూరమగు భయోత్పాతమును గలిగించెను. అతఁడు యుద్ధవాదికాడు. కాని ప్రపంచమున మిగుల శక్తివంతమును జయసాధనమునగు సేనాయంత్రమును సర్వజనవిరోధమూలమున నతఁడు నిర్మించెను. లెనినువంటి వింతమానిసి చరిత్రయం దెచటను నాయెఱుఁగినవరకు గనరాడు. ఆతఁడు నిరాక్షేపణమయిన నిష్కపటమగు సంస్కర్తయు, పరధనపరదారావిముఖుఁడును, దంభరహిత నిజజీవితమార్గుఁడును, ప్రపంచోద్ధరణదీక్షాపరుండును, స్వార్థత్యాగియు పరార్థప్రాపకుడునయియుండియు నతఁడు బిడ్డలయందలి ప్రేమభావముదక్క యితరవిషయమున కఠినుఁడును తలతిక్కస్వభావముగలవాఁడును, నిరంకుశుఁడును, నిర్దయుఁడును, అసామాన్యాకృతుఁడుగను నుండును. ఈతనియందు ప్రేమార్ద్రమును మార్దవమునగున దెద్దియును లేదు. ఆయన నల్లసిలవలె నతి కఠినుఁడును నినుమువలె నిర్దయుఁడుగను నుండెను. ఈ కారణముచేత నెవెల్సుగారు వినెన్‌మహాశయుని గూర్చి తలచునపుడెల్ల మహమ్మదు స్మరణకు వచ్చునని యేనెఱుఁగుదును. బెంట్రెండురసెలుగారు లెనినుగారిని యాతని పరిపాలననుగాని తలంచునపుడెల్ల క్రాంవెల్లనుప్యూరిటనుతెగవాడు స్మరణీయుఁడగుచుండెను. కాని నేనాతనిని దలచినపుడెల్ల, నెపోలియను బోనపార్టీని జ్ఞాపకము తెచ్చుకొనుచుందునని నేను వెల్లడించుచున్నాను. ఈ యుపమానములలో

నెద్దియును సరిపడి యుండలేదు. అందు ముఖ్యముగ చివర యుపమానము బొత్తిగ సరిపోదు. కాని దీనివలన నాతని యత్యద్భుత ప్రజ్ఞావిశేషమును, కార్యదీక్షా ధురంధరతయును సువ్యక్తమగును.

ఇంకను ప్రపంచమునందలి సర్వోత్కృష్ట పురుషరత్నమును కనుగొని యుండలేదు. ఆదర్శకుఁడగు రోలండు కార్యనైపుణ్య హీనుఁడు. కార్యదక్షుఁడగు లెనిను యాదర్శరహితుఁడు. ఇపుడు మనకు సర్వసద్గుణ సంపూర్ణుఁడును, పయి పరాసుదేశీయుని యొక్కయు, రుషిదేశవాసియొక్కయు సుగుణౌన్నత్య సహితుఁడగు నాదర్శావిష్టుడయ్యును కార్యదక్షుఁడును, భావనాపరుండయ్యును కర్మకౌశలుఁడును, భగవదోద్దేశ్యగ్రాహియగు ప్రవక్తయయ్యును నాదివ్యస్వప్నమును యథార్థపరుచువాడును నగు మహాపురుషుఁ డిపు డవసరమయి యున్నాడు. అట్టిమహాత్ము డిప్పుడేడయిన నీ విశాలప్రపంచమున నున్నాడా?

ప్రపంచచరిత్రములో సృష్ట్యాదినుండియు నుండిన మహామహులలో ప్రకృతమున్నవారిలో నిస్సంశయముగ నగ్రగణ్యుఁడు నిపుడొకఁ డున్నాడని నేనమ్ముచున్నాడను. 1917 సం॥రములో గిల్బర్టుమర్రేమహాశయుఁడు హిబ్బర్టు పత్రికలో వ్రాసిన వ్యాసముఖమున నీయననుగూర్చి తొలుత వింటిని. అంతటినుండి కొన్నినెలలక్రిందటివర కాయనను గూర్చి మఱివినియుండలేదు. అప్పు డాతని యుపన్యాసముల నుండియు వ్రాతలనుండియు నచ్చొత్తఁబడిన కొన్నిభాగము

లోక కాగితపుటట్టలుగల యొక చిన్నపొత్తము నొకదానిని నా వ్రాతబల్లపయిని గాంచితిని. ఇది యాయనను గూర్చి తెలిసికొనుట కత్యల్పాధారము. ఛాపీమ్యానుగా రింగ్లీషులోనికి పరివర్తించిన ఇలియడ్ గ్రంథమున నీభాగమును మొదట జదివినపుడు జాన్‌కీట్సు కవివరున కెట్టిమానసోత్సాహము కలిగెనో యట్లే యా చిరుగ్రంథపఠనమున నాకును నట్టి యుత్సాహమె కలిగెను. క్రొత్త నక్షత్రము నొకదానిని నింగిని కని పెట్టినపుడు నక్షత్రదర్శకుఁ డెట్టి యానందమునందునో యట్టి యానందమును నేనును నందితిని. తన యనుచరు లొండొరుల సాభిప్రాయవీక్షణముల జూచుచుండ దారియను దేశపు శైలశిఖరాగ్రమునుండి ధైర్యశాలియగు కార్టిజుగారు గృధ్రదృష్టితో శాంతమహాసముద్రమును తదేకదృష్టితో గాంచి విస్మయుఁడై నిశ్శబ్దముగ నిలచిన సమయమున యాయనకు కలిగిన యానందమువంటి యానందమును నేను బొందితిని.

నాహృదయస్థితుఁడు మోహనదాసుకరంచందు గాంధియను నాతఁడు. ఇతఁడు హిందూదేశమందలి బ్రిటిషుసామ్రాజ్యపరిపాలనకు విరుద్ధమగు విప్లవోద్యమనాయకుఁడగు నొక భారతీయుఁడు! ఆయన స్వదేశీయులవలన మహాత్ముఁడను బ్రఖ్యాతితోఁ బూజింపఁబడుచున్నాఁడు. మీలో నెందరా మహాత్మునిగూర్చి తెలసియున్నారో! ఆతని పవిత్రజీవితచరిత్రమును వినియున్నారో! నాకు తెలియదు. ఆకథను సావధానులయి విని, యతఁ డీప్రపంచమున సర్వోత్కృష్టుడని నాచే నుడువఁబడుట సమంజసమగునో కాదో పరికింపుడు.

గాంధిగా రిండియాలో నేబది యెరువది వర్షముల క్రిం ట ధనవంతులును, విద్యావంతులును, జ్ఞానవంతులునగు ొక కుటుంబమున జననమందెను. అట్టి కుటుంబములోని బిడ్డ లెట్లుపెంచబడుదురో యట్టి గారాబముతో తల్లిదండ్రుల వలన ధన సంపాద్యవస్తువులనెల్ల బొందుచు, నల్లారుముద్దుగ తృ నిర్దిష్టమార్గమున బెరుగుచుండెను. 1889 సం॥లో ాయన న్యాయశాస్త్ర పఠమునకై యాంగ్లదేశమున కరిగె ం. యుక్తకాలమున నతఁడు పట్టభద్రుఁడయి తిరుగ భారతభూ మి కేతెంచి బొంబాయినగరమున జయప్రదుఁడగు న్యాయవాది యయ్యెను. ఐన నంతకుమున్న యాతఁడు తనజీవితమున మతాభినివేశము గలిగియుండినటుల దీకించెను. అతఁ డాం గ్లేయదేశయాత్రకు మున్నె సురాపానమాంసభక్షణ స్త్రీసం భోగముల వర్జింప జయినవ్రతమును బూనెను. అతఁడు హిందూదేశమునకు తిరిగివచ్చినపిమ్మట నాతనికి వైరాగ్య మతిశయించెను. తన నీతిధర్మాదర్శమునకు ధనమంతరాయ కారణమని యెంచి తన యవసరములకు స్వల్పద్రవ్యము నుంచుకొని తక్కినదంతయు ధర్మకార్యములకు వినియోగ పరచెను. పిమ్మట భిక్షుకవ్రతమును బూని నేటికి నట్లే వర్తిం చుచుండెను. ఇటీవల నహింసావ్రతము నూనెను. అహింసయే హిందూధర్మసారమని యాతని యభిప్రాయము. తత్కారణ మున న్యాయవాదివృత్తిని విసర్జించెను. న్యాయవాదివృత్తి దా క్షిణ్యమూలమున న్యాయస్థాపన చేయునదని యాతని యాశ యము. 1914 సం॥లో గిల్బర్టు ముర్రేగారాయన నింగ్లాండు

ల్లో గాంచినపు డాతఁడు వరియన్నమునుమాత్రముతిని జల మాత్రపానియై కటికినేల బండుకొనుచుండెను. అతని ప్రసంగ మాతని బుద్ధికుశలుడనియు, బహుగ్రంథదర్శియనియు అతనియందొక యనిర్వాచ్యమయిన మహత్తుకలదనియు సూచించుచుండెనని నుడువుచున్నారు. గాంధినిశ్చయముగా మహాత్ముడేయయ్యెను. విషయలోలత యేమాత్రమున్నను తన నీతిధర్మమున కంతరాయము కలుగుననుభీతిచే నాయన బాల్యమునుండియు లోకసంగ్రహార్థము తన శారీరకాధ్యాత్మికములగు సర్వశక్తులను ధారపోసిన యనన్య సాధారణప్రజ్ఞాయుక్తుడు.

ఆయన వ్యావహారికమార్గమును రెండుభాగములుగ విభజింపవచ్చును. అందు మొదటిది 1893 మొదలు 1913 సం॥ రమువరకును వ్యాపించియున్నది. ఆకాలమున నతఁడు దక్షిణాఫ్రికాలోనుండెను. రెండవభాగము 1913 మొదలు నేటిదనుక హిందూదేశసంబంధము కలదిగనున్నది.

దక్షిణాఫ్రికాలో పందొమ్మిదవ శతాబ్దాంతమున 150000భారతీయులు నేటాలు రాష్ట్రమున నివసించియుండిరి. ప్రస్తుతము జపానుదేశీయులు రాకమున్న కాలిఫోర్నియాలో నెట్టిపరిస్థితులున్నవో, విదేశీయులగు భారతీయుల యునికివలన నేటాలులోకూడ నట్టిపరిస్థితులేయుండెడివి. వర్ణసమస్య బహుతీవ్రముగనుండెను. దక్షిణాఫ్రికా దొరతనమువారు తమదేశమున నదివరకుండిన భారతీయులను దేశమునుండి తరిమివేయుటకును, క్రొత్తవారిని రాకుండ నిషేధించుటకును నిశ్చయించు

కొనిరి. దేశస్థులను పంపివేయుట న్యాయానుసారముగ వీలు కలుగకుండెను. వీలనన నక్కార్య మొకయొడంబడికకు విరుద్ధమగుటను తమ వ్యాపారములన్నియు చౌకగదొరకు కూలీలపయి నాధారపడియుండుటచే నేటాలు ప్రజలు ప్రభుత్వమువారి ప్రతిఘటించుటచేతను, ఇండియాదొరతనమువారి యాక్షేపణ వలనను వారిని తరుమ నవకాశ మొదవకుండెను. క్రొత్తవారిని రాకుండజేయుట నిషేధచట్టమువలన సుసాధ్యముగ నుండెను. తత్క్షణమే దీర్ఘమయి తీవ్రమయిన కలహాప్రారంభ మయ్యెను. భగ్నాశులయిన దక్షిణాఫ్రికాలోని తెల్లవారు స్వజాతీయుల నితరదేశములలో బ్రతిచోటను నట్టి పరిస్థితులలో జరపుచున్న రీతిని యిచటను తమకంటె తక్కువవారనియెంచి యసహ్యించుకొనుచు నల్లవారిని పలుబాధలబెట్టుచుండి కూలీలకంటె నున్నతస్థితిలోనున్న భారతీయుల కచట జీవయాత్ర నడపుట దుర్భరమగునటుల విడువక తమ క్రౌర్యమును వారిపయిని జూపుచు కసిదీర్చుకొనసాగిరి. ఈవిధమున భారతీయులకు ప్రత్యేకముగ కొన్ని పన్నులవిధించి బాధించిరి. అవమానకరమగురీతిని వారిపేరులను జాబితాలలో వ్రాయబలాత్కరించిరి. వారిని ఖయిదీలట్లు బొటనవేలిముద్రలనుకూడ వేయించుచుండిరి. వారిని బహిరంగముగ నవమానపరచుచు నీచముగ జూచుచుండిరి. నల్లవారిని బాధింప న్యాయచట్టము లుపయోగించునపుడు వారు మన మమెరికాలో గర్హితులనుగ జేయురీతినే దేశాభిమానసంఘము లనుపేరున నల్లరిమూకలనుజేర్చి దోచుకొనుట, గుండుగాల్చుట. యిష్టానుసారముగ నల్లరిజేయుట

మొదలగుపనులనుచేయుచుండిరి. పాపమీనిర్భాగ్యభారతీయుల ను హింసించుటకును వారి నాదేశమునుండి భయదైన్యములతో తొలగునటుల జేయుటలో సర్వోపాయముల నుపయోగించిరి.

1893 సం॥రములో దక్షిణాఫ్రికాయందలి భారతీయులు గాంధిగారికి తమదుఃఖముల నివేదించి, వచ్చి తమ్ము రక్షింపవ ప్రార్థించిరి. తక్షణమ వారిమొరల నాలించెను. తనదేశీయు లే చ్ఛోటనయిన పీడజెందు నెడల వారితోడ తానును వారికష్టము ల పాల్గొనుట తనవిధ్యుక్తధర్మమని యీమహాత్ముని విశ్వాసము కావుననే 1893 లో నాయన నేటాలు దేశమునకు విచ్చేసి యట నేస్వల్పకాలము లేకుండనోగాని 1913 సం॥రమువరకు నిరువది వత్సరము లట నుండిపోయెను. అప్పటి కాతఁడింకను న్యాయవాదిగనుండుటచే నాసియాఖండవాసుల నిషేధచట్ట మును (Asiatic Exclusion Act) ఖండింప నారంభించి రా జ్యాంగపథకవిరుద్ధమను తీవ్రమయినట్టియు, నీచమగునట్టియు, ప్రతివాదములుండినను విజయమును గాంచెను. సాంఘిక రాజకీయ విషయములయందు న్యాయపరిగణనముకొరకు ఘోరయుద్ధ మారంభమాయెను. ఆ పోరాదినుండి యంతము వరకును నహింసారూపకమగు సత్యాగ్రహావ్రతసాధనసంపత్తి మాత్రముననే సాగుచుండెను. ఈదీర్ఘ కాలమున నొకపరి యాయినను, యేవిధమయిన దౌర్జన్యము నవలంబించి యుండ లేదు. కోపహేతువులకు లొంగిపోయి, వానికి బ్రతిక్రియ లొన రించు బుద్ధిగాని పగదీర్చుకొను నూహగాని వారికెన్నఁడును జనించి యుండలేదు.

తన ప్రజలకు నాయకుఁడుగను, సలహాకారుఁడుగను నుండియుండియును, గాంధిగారు దుర్బాన్‌నగర బాహ్యప్రదేశమున ననతిదూరములో నొక మయిదానముపయిని సపరివారముగ కుటీరములలో నివాస మేర్పరుచుకొనెను. ఇచట భారతీయుల నెల్లర జేర్చి, యుదరపోషణకయి కృషికర్మ మేర్పరచి, బీదలుగనుండుట యుపవిత్రముగ వారికి నియమించెను. ఇచట వేనవేలు సత్యాగ్రహవ్రతులు సంవత్సరములకొలఁది యాంగ్లేయులొనర్చు దౌర్జన్యములకును దోపిడులకునోర్చుచు, పలు కడగండ్లతో దొరతనమువారితో పోరాటమును సాగించుచుండిరి. ఇది ముఖ్యముగ నొకసమ్మె. పల్లెలలోను పట్టణములలోను నుండు భారతీయులగు కూలివాండ్రు పనులు చేయమానుటచే దొరతనమువారి సాంఘిక కార్మిక విషయజీవిత మరికట్టబడెను. పూర్వము మోసనుగారు యీజిప్టులో నొక భాగముగు పెరోవా దేశమునుండి యస్‌కిమోలను కొనిపోయి యరణ్యావాసముచేసిన సమ్మె నిదిపోలియుండెను. కాని యీసమ్మె కట్టేయను నెడల మానవచరిత్ర నుదహరింపబడిన యితర సమ్మెలకును దీనికి నొక గొప్పభేదమున్నది. సాధారణముగ నిట్టి యుద్ధములలో నిరోధకులు తమ శత్రువులకు వాటిల్లిన ముప్పుల నవకాశముగ జేసికొని తమకోర్కెలను మరింత బెట్టుగ బిగించుచుందురు. అయినప్పటికిని గాంధి యిందుకు వ్యతిరిక్తమార్గము నవలంబించెను. ఈకలహాకాలములో నెన్నఁడయిన దొరతనమువారికి యెదురుచూడని యిక్కట్టులు కలుగునెడల గాంధిగారు తమ పోరాటమును విజయాభిలాషతో సాగింపక, పోరాటమునునిలిపి తన ప్రతికక్షులగు దొరతనమువారికి సాయపడు

చుచుండువాడు. ఇందుకు దృష్టాంతముగ 1899 సం॥రంలో బోయరు యుద్ధారంభమయ్యెను. అపుడు వెంటనే సమ్మెను నిలుపుచేసి యుద్ధకాలమంతయును గాయములు తగిలినవారికి సహాయము నరింప నిండియను రెడ్ క్రాసుసంఘమనుపేర భారతీయుల నొక్క సంఘముగ నేర్పరచెను. ఈ సంఘమొనరించిన సేవావిశేష మును రెండుమారు లాంగ్లేయసామ్రాజ్యస్థానమునకు దెలుప బడెను. ఈసాంఘికు లగ్నివర్షములో నిర్భయముగజొచ్చి యొనర్చినసేవకు గాంధిగారికి నెటాలు దొరతనమువారు బహి రంగముగ కృతజ్ఞతాపూర్వకవందనము లర్పించియున్నారు. 1904 సం॥రములో జోహాన్సుబర్గులో మహామ్మారి రోగము వ్యాపించెను. అపుడు వెంటనే సమ్మెను విడిచిపెట్టి వ్యాధి బలవత్తరముగనున్న పట్టణములో నొక చికిత్సాలయము నేర్పరచుటకు గాంధిగారు, ప్రబలప్రయత్నము గావిం చిరి. 1906 లో నేటాలుదేశమున స్వదేశీయుల తిరుగుబాటు సంభవించెను. ఆకాలమునగూడ సమ్మెనునిలిపి గాంధీగారు శవవాహకసంఘముల నేర్పరచి యందొకదానికి తానునాయ కుడై పనిచేసెను. ఈపని మిగులకష్టమును నపాయకరమునై యుండెను. ఈసందర్భమున నేటాలు పరిపాలకుఁడు గాంధి మహాత్మునకు బహిరంగముగ కృతజ్ఞతాభివందనముల గావిం చెను. పిమ్మట కొంచెముకాలములోనే సమ్మె తిరుగ ప్రారం భముకాగా గాంధిగారు జోహాన్సుబర్గులో నొక సామాన్యకా రాగారమున బద్ధులయిరి. ఈరీతిని గాంధీమహాత్ముఁడు సమ్మె లుగావించుచు నెడనెడ దయార్ద్రహృదయుఁడై వానినినిలుపు

చుండు నీదీర్ఘకాలమున నెట్టి యవమానముల నెట్టికూ్రర హింసల నాయన యనుభవించియుండెనో నేడు నేను వర్ణింప నలవిగాకున్నవి. అత డనేకసారులు కారాగారబద్ధుడయ్యెను. చీకటికొట్టులో నేకాకిగా నుంచబడెను. తాను బంధింపబడిన కారాగారమునందలి ఇనుపకడ్డీల కాతనికాళ్ళేతులు కలియగట్టిరి. అల్లరిమూక లనేకము లామహనీయునిపయి పలుమారు బురికొల్పఁబడి ఆయనను స్మృతితప్పునట్లు చావమోది మృతిగాంచెనను నూహతో బాటలప్రక్కల విడిచిపోయిరి. ఈరీతిగ హింసింపఁబడినప్పుడు ఆయన బహిరంగముగ నవమానితుడుగను విన్నబాటున మిగుల బాధితుఁడుగను గావింపఁబడుచుండెను. కాని యీ బాధలెవ్వియు నామహనీయుని ధైర్యసారమును చలింపజేయు లేదు. శాంతమును తొలగింపలేదు. ఓరిమికి భంగము గావింపలేదు. శతృ్రులయెడ ప్రేమక్షమాపణ బుద్ధుల నరికట్టలేదు. తుద కిరువది దీర్ఘవత్సరము లనేక బాధల జెందినపిమ్మట విజయము నాతఁడుగాంచెను. 1913 సం॥రమున హార్డింజిప్రభువరుఁడు భారతీయసమస్యను సాధింపఁబూనెను. ఇంపీరియల్ కమీషనను సామ్రాజ్యాధికారులచే నియమింపబడిన యొకసంఘమువారు గాంధిగారివాదమున కనుకూలముగ ప్రధానములగు వివాదాంశముల నన్నిటిని సామ్రాజ్యమువారికి నివేదించిరి. ఆయన వాదముల నన్నిటి నధికారులామోదించి తదనుకూలముగ నొక శాసనమును గావించిరి. ఒదుగుచేయక, దౌర్జన్యావలంబనము లేక శతృ్రకృతశిక్షల నోరిమిగ ననుభవించుచు తుదకు శతృ్రవులే తమ శిక్షావిధికి

విసిగి లజ్జించునట్లొనర్చి పోరున విజయమును గాంచిన యత్యాద్భుతనిదర్శన మింతకు మీరిన దెద్దియును లేదు.

గాంధీమహాత్ముని జీవితచరిత్రమున రెండవభాగము 1913 సం॥ రమున ప్రారంభమయి నేటికి నత్యుచ్ఛస్థితిలో నున్నది. ఈకాలమున మహాత్ముఁ డాఫ్రికాలో నున్నప్పటి నుండియు క్రమాభివృద్ధి గాంచుచుండినభారతభూమి యందలి విప్లవోద్యమమునకు సంబంధించి యుండెను. ఆయన హిందూదేశమునకు మఱలిరా వేగమె యాయన యీయుద్యమ నాయకత్వభారమునువహించెనుకాని 1914సం॥రమున జర్మనీయింగ్లాండుదేశములకు మహాసంగ్రామము సంభవించినందున బ్రిటిషుప్రభుత్వవిరోధముగ తానుచేయవలసిన చర్యలన్నిటిని నిలుపుచేసెను. అట్టిసమయమున నింగ్లాండు నెదుర్కొనుట వీరకర్మ కానేరదని యాయన యాశయము. ఇట్టిపని దేశములయెడ గాని మనుజులయెడగాని చేసినచో నది భీరుత్వకర్మమన బరగును. తన మతాదర్శభంగహేతువులుకాని సర్వవిధముల నత్యుత్సాహముతో నాయుద్ధకాలమున గాంధిమహాత్ముఁడు బ్రిటిషుసామ్రాజ్య సహాయమును గావించెను.

ఈయుద్ధానంతరమున నిక్కాలమున నాంగ్లేయ నిరంకుశాధికార ప్రభావముచే భారతీయు లనుభవించిన పరాభవమువలన ప్రోత్సహింపబడి గాంధిమహాత్ముఁడు తన కలహధ్వజమును మఱల నెత్తి బ్రిటిషుసామ్రాజ్యము పునాదినుండియు నల్లల చలింపఁజేయు నత్యద్భుతమగు నసహకారోద్యమము నేర్పరచెను. గాంధిగారి నాయకత్వమున నడపఁబడు నీయుద్య

మ యొక విప్లవమననొప్పను. కాని ప్రపంచచరిత్రమున నిది వరకెన్నఁడిట్టి విప్లమును గాంచి యెఱుఁగము. ఇయ్యది నాలుగు ప్రధాన లక్షణములతో కూడియున్నది.

అందు మొదటి దీయుద్యమ మింఁడియాలోని బ్రిటిషు ప్రభుత్వముపయిని ప్రయోగింపబడియున్నది. విదేశీయ పరిపాలనవలన కలిగెడు క్రూరత్వాన్యాయములనుండి తన ప్రజలను దొలగించుటకు బహిరంగముగ గాంధిగారు తమ నిశ్చయమును బ్రకటించుచున్నారు. దొరతనమువా రన్యాయపరులుగ నుండునంతవరకు నేను వారికిలొంగను, శత్రుఁడనని యాయన నుడివెను. న్యాయమన నయిష్టపడువారినుండి న్యాయలబ్ధిగాంచుటనుక నీ ప్రభుత్వవిధానము సరికట్టుబూనెదను. ఇదియు నాదీక్షయనియును, యీనిరంకుశ ప్రభుత్వము నశించుదనుక మనఃపూర్వకముగ దాని నేనెదుర్కొందును అని గాంధి మహాత్ముఁడు నుడివెను. ఇది రాజద్రోహనేరమని గాంధీమహాత్ము డెఱుఁగకపోలేదు. హిందూదేశ శిక్షాస్మృతి ననుసరించి రాజద్రోహనేరమునకుగాను, ఆయనపయిని దోషారోపణము గావించునెడల దాను నిర్దోషియని వాదింప వీలులేదు. ఏలనన తన యుపన్యాసములు ప్రస్తుత ప్రభుత్వ విధానమువారియెడల విరాగముగూర్చుటకె యుద్దేశింపఁబడినవనియు, నా ప్రజావిశ్వాసమును, గౌరవమును, సహాయార్హతను గోల్పోయిన ప్రభుత్వమునకు సహాయమొనర్చుటకు ప్రజ లీవిరక్తిచే లజ్జించునట్లు చేయుటయే తన యుద్దేశమనియు నాయన నుడివెను.

ఆంగ్లేయ పరిపాలనా విధానముపయి నిట్టి ఘనవిరోధము కలిగియున్నను ఆంగ్లదేశీయులపయి ద్వేష మెంతమాత్రము లేదు. గత మహాసంగ్రామమున మన మెల్లరము ప్రజాప్రభుత్వములు భిన్నములని తలంపక పొరబాటు చెంది యుంటిమి. కాని గాంధీ మహాత్ము డట్టి పొరబాటు నెన్నఁడును పొందియుండలేదు. బ్రిటీషుప్రజలతో వారి యెడల తనకు ప్రేమగలదనియు వారి సహవాసము నాకవసరమనియు తెలియ జేయుచున్నాననియు మహాత్ముఁ డనుచున్నాడు. కాని యీ ప్రేమాసహవాసములు యాత్మగౌరవమునకుగాని సమానత్వమునకుగాని విరుద్ధముగ నుండరాదు.

రెండవది గాంధీ మహాత్ముని యుద్యమము పశుబలమునకును యేవిధమయిన దౌర్జన్యమునకును, చోటీయని విప్లవముగనున్నది. దౌర్జన్యరాహిత్యము దాని ముఖ్యప్రాణమయియున్నది. ఏలన గాంధీమహాత్ముఁ డహింసావ్రతుడని మన మెఱిఁగి యున్నాము. దక్షిణాఫ్రికాయందువలె నిండియాలోగూడ నీతఁడు శాంతియుత సాధనమూలముననే విజయమును గాంచెను. లేనిచో పోరాటమునుండి విరమించును. ఐరోపాఖండమున దౌర్జన్యము కార్యసాధనమైన నగుగాక. ఇండియాలో నెంతమాత్రి ముపయోగింపదు. మనము పరిశుద్ధాయుధములతో ధర్మమార్గమున పోరుసలుపవలెను. ఈవిధముగ వారిరాక్షసత్వమును మన దివ్యత్వముచేతను, వారి యసత్యమును మనసత్యముచేతను, వారికాపట్యమును మన నిష్కాపట్యముచేతను, వారిబూటకములను మనసాధుత్వము

చేతను వారి భయంకరత్వమును మన సహనభావముచేతను నిర్జింపవలెను. మన పక్షావలంబకులు గానివారియెడల మనము దౌర్జన్యమును బూనరాదు, అని పలుకుచున్నారు. ఆహా! లెనినుగారీ నీతిమార్గానువర్తియగుచో నెంతసమంజస ముగనుండును. ప్రతియాంగ్లేయుని ప్రాణమును ప్రభుత్వో ద్యోగులప్రాణములను మనప్రాణములవలె మనము కాపాడ వలెనని, తనయనుచరుల కాయన శాసించియున్నాడు. ఐర్లాం డుదేశమున సిన్ఫెయినువారీనీతిని గమనించిన ఐర్లాండు దేశ మున కెంతమేలు కలిగి యుండెడిది. భారతీయులు ఖడ్గవాదము నంగీకరింతురేని నాప్రాణము తక్షణమే పోవును. నేనెంత మాత్రము భారతీయుఁడనఁబడఁజాలను. భారత దేశాభి మానము నన్ను వీడిపోవును.

దౌర్జన్యరాహిత్యము నాయన బోధచేయుటకు కార ణము భారతీయుల దౌర్బల్యముకాదని గాంధీమహాత్ముఁడు నొక్కి వక్కాణించుచున్నాడు. ఇందుకు వ్యత్యయముగ భార తీయులు బలవంతులు గావునను తత్కారణమున వారీమార్గా వలంబన వలన కలిగెడు నపాయముల భరింపశక్తులుగాన వారికి దౌర్జన్యరాహిత్యము నుపదేశింపుచున్నాడు. ఈ దౌర్జన్యరాహిత్యమను నాయుధము బలవంతు లుపయోగింప నర్హముగాని దుర్బలుపయోగింపదగినది కాదని తననమ్మిక యనియు కవచాదిహీనమగు వక్షముతో నిరాయుధుఁడై శత్రునెదిరి మృతిగాంచునతఁడే వీరాధివీరుఁడని నేను నమ్ము చున్నాడననియును, భారతభూమి ప్రజ్ఞాబలయుక్తమగుటనే

దౌర్జన్యరాహిత్య మార్గము ననుసరింపవలెనని కోరుచున్నాడ ననియు, దాని కాయుధములతో బనిలేదనియు, మనము మాంసపుముద్దయగు స్థూలశరీరమునే యాత్మయను భ్రాంతిలో నుండుటచే నాయుధము లవసరమని మనకు దోచుచున్న దనియు, భారతమాత నాశన రహితాత్మను కలిగియున్నదనియు, ఆయాత్మ కాయుధ దౌర్బల్యములపయి విజయమును గాంచుననియు ప్రపంచమందలి భౌతికశక్తులన్నియు నేకీభవించినను విజయమునందునని భారతీయులు గ్రహింపవలెననియు, గాంధీమహాత్ముఁడు దెలుపుచున్నాడు. అహింసామార్గము నాయన యుపదేశించుచు నాచరించుటకు ముఖ్యకారణమామార్గము నీతియుక్తమని యాయన తలంచుటచేతనే యయియున్నది. దౌర్జన్యస్థాపిత న్యాయమెవ్వరికిని సత్యము కానేరదనియు, స్వార్థపరిత్యాగాత్మకమగు న్యాయమె సత్యమనియును, దౌర్జన్యరాహిత్యము యుక్తమయినదియు, ఘనమయినదియు, నగు ధర్మమనియు, క్షమయే వీరశిఖామణికలంకారమనియు, మహాత్ముఁ డుద్బోధించుచున్నాడు. ఇట్టి యుద్దేశములతోడనే గాంధిమహాత్ముఁడు తన యుద్యమమును ధర్మయుద్ధమనుచున్నాఁడని నేనూహింతును. ఐన నహింసామార్గము నీతిధర్మమెగాక యవసరమార్గమనికూడ నాయన మాటిమాటికి తరుచు తెలుపుచుండును. శాశ్వతవిజయసంపాదన కిదియొక నిశ్చయమార్గమనియునుఁ దెలుపుచున్నాఁడు. దౌర్జన్యరాహిత్యమును గూర్చిటయు జయమని, ధనప్రాణహరణములకు భారతీయులు పూనినపూనగలరుకాని యందువలన నేమియు బ్రయోజనముండనేరదు

డనియు, నీకు బాధనోర్చుటయను నొకయస్త్రమే చాలున నియు, నీతిప్రపంచధర్మము నెఱిఁగినవారికీసత్యము సుగ్రాహ్య మనియు, శాంతియుక్తమును నమోఘమునగు నీధర్మరహస్యము నెఱుఁగగోరునెడల మనము మనలశక్తితోనరకవచ్చినను, వారినయిన నొకయాగ్రహోక్తిని బలుక నవసరముండదనియు, కొంచెమయిన ప్రతిక్రియను చేయనవసరముండదనియు, మనముగ్రహింతుమనియు గాంధీమహాత్ముఁడు పలుకుచున్నాడు.

కేవల దౌర్జన్యరాహిత్యము మాత్రము చాలదు. అహింసయన బాధాసహనముగదా! నిర్దిష్టమును, నెరుర్కాను స్వభావము గలదియునగు తంత్రముతోఁగూడి యుండవలెను. గాంధీమహాత్ముఁ డిట్టితంత్రమునే యసహాయోద్యమమను పేరున నమర్చియున్నాడు. హిందూదేశమున నాంగ్లేయపరిపాలన శాశ్వతముగనుండుట కవసరమగు సాంఘికరాజకీయ క్రమములలో తనయనుచరుల నెవరిని సంబంధముకలుగ జేసికొనవలదని మహాత్ముఁడునిర్దేశించియున్నాడు. భారతీయు లాంగ్లేయులతో సంబంధించిన ప్రతివిషయమును బహిష్కరించి, ఆంగ్లేయపరిపాలనాక్రమము నంతను, నిరోధింపవలయునని వారిని హెచ్చరించుచున్నాడు. ఈవిధముగ తనదేశప్రజలనెల్లరను స్థానికసభలను విసర్జింపుఁడనియును, న్యాయవాదుల న్యాయస్థానముల బరిత్యజింపవలెననియు తల్లితండ్రులు తమబిడ్డలబడుల [illegible]కానవియు బిరుదములు వహించినవారు తమబిరుద

యువరాజుగారి ప్రయాణసందర్భమున భారతీయులందరిని యాయునకు స్వాగతమొసంగకుండను తమయువరాజును తా మాహ్వానింపలేదని తెలుపవలెననియు మహాత్ముఁడు హెచ్చరించెను. ఆంగ్లేయవస్తువుల నన్నిఁటిని పూర్ణముగ బహిష్కరించుతలంపు ప్రజలలో పుట్టినను, మహాత్ముఁ డంగీకరింపలేదు. ఈవిధానము క్రమముగ జనసామాన్యముచే నాదరణమున నుండబడినచో, బ్రిటిషు ప్రభుత్వమును తప్పక స్తంభింపఁజేయు గలదు. విషప్రయోగమువలన క్రమేణ విషమెక్కిన సోక్రిటీసు రీతిని, యీప్రభుత్వముకూడ కాలక్రమమున నిరోధింపఁబడి స్తంభించును ప్రపంచములో నెన్నఁడెఱుగని శాంతియుక్తమగు విప్లవము జయము గాంచును.

కడపటిది తనయుద్యమమునకు మకుటముగ భారతీయుల కాధ్యాత్మిక నైతికాభ్యుదయములను దేశాచారవ్యవహారభావాదర్శముల ననుసరించిసంపాదింపయత్నించుచున్నాడు. కార్మికదాస్యము (Industrial slavery) భౌతికవ్యామోహము (Materialisam) ద్రవ్యారాధనము (Money worship) యుద్ధములు మొదలగు పాశ్చాత్యసంబంధములు సాధ్యమగు నంతవరకు తొలగించుటయ దీనికర్థము. భారతీయు లన్యోన్యజాతివిభాగములను గావించు నడ్డంకుల నున్మూలించి వారికెల్లరకు సామాన్య సౌభ్రాత్రమునుగూర్చుటయె యీమహోద్యమమున బ్రధమకర్తవ్యముగనున్నది. ఇందుకొరకు జాతిమతభేదముల నంతరింపఁజేయుమార్గముల నరయుచుండెను. హిందూముసల్మాను

భేదముల వీడి యొండొరులతో మైత్రిగలిగి నెమ్మదిగ మనవల యును. వారు లోకశాంతమువలనను, స్నేహభావమువలనను మానవనాయకత్వము సిద్ధింపజేయవలెను. భారతదేశము ప్రపంచమునకొక సందేశమును దెలుపగలదనియు, కావున నాతని యాదర్శములు జాతిదేశాద్యవిచ్ఛిన్నములుగాక సకలమానవాభ్యుదయ సహాయకములనియు, తన మతమునకు దేశభేదములేక సార్వత్రికవ్యాప్తమనియు, దానియెడ తనకు పూర్ణవిశ్వాసముండెనేని యదియొక భారతదేశాభిమానమున కధికమగుచున్నది.

గాంధీమహాత్ముఁడిట్టివాఁడు. ఈమహాత్ముఁడాధ్యాత్మికశక్తితో నతఁడు జనులలో జీవించుచున్నాఁడు. అతఁడొక యూరినుం డింకొకయూరి కేగునపు డాతని ప్రసంగముల వినుటకు ముప్పది లేక యేబదివేలవరకు జను లాయనచుట్టును మూగుచుందురు. ఏగ్రామముననో, యేమైదానముపయినో యొకరాత్రి బసఁజేసియుండు నపుడు, దేవాలయములకు దైవదర్శనమున కేగునట్లు జనసమ్మర్దము చేరుచుండును. హైందవు లాయన నెంచినటుల నాయనసంపూర్ణుఁడును, మహా ఁడునుగ దోచును. అతఁడు సాధుశీలుఁడును, పుణ్యచరితుఁడును. అతఁడు రాజకీయోద్యమమున లెనిన్ వలె కార్యదక్షుఁడు. దేశస్వాతంత్ర్యసంపాదనమునకై నిరంతరము కృషి చేయుచున్నాఁడు. అయినను రొమెయిను రోలండువలె నత డాదర్శావిష్టుఁడై యాధ్యాత్మిక తేజోమండలనివాసియగుచుండును. రోలండును తలంచినప్పుడు టోల్స్టోయి స్మరణకు

వచ్చునని లెనినును గూర్చి తలంచునెడల నెపోలియను స్మరణకు వచ్చుననియును, దెలిపియుంటిని. కాని గాంధిని దలంచినపుడు యేసుక్రీస్తు నాకు స్మరణీయుఁడగుచుండును. ఆజీవితమునే యీతఁడును జీవించుచున్నాఁడు. ఆయన మాటలనె యీతఁడు పలుకుచున్నాఁడు. బాధల కోర్చుచున్నాఁడు. ప్రయత్నములఁ జేయుచున్నాఁడు. ప్రపంచమున భగవత్సామ్రాజ్య స్థాపన కొరకు ఎప్పుడో ఘనముగ ప్రాణత్యాగము చేయును.

ఒకదినము క్రీస్తుప్రభువు ప్రయాణము చేయుచున్నపుడు తనశిష్యు లొండురులతో గలహించుచుండుట నొకనాఁడు వినినప్పుడు ద్రోవలో మీ రెందునుగూర్చి వాదించుచున్నారని యడిగెను. వారు తమలో నెవఁడు సర్వోత్తముఁడని వాదులాడు చుంటిమనిరి. అపుడా యేసుప్రభుఁ డిట్లనెను. "మీలో నెవఁ డగ్రగణ్యు డనిపించుకొనగోరునో వాఁడందరికి సేవకుఁడుగ నుండుఁగాక" యనియెడు కథ స్మరణీయముగనుండును.



# నీతిధర్మము.

(గాంధీమహాత్మ విరచితము.)

## ఉపోద్ఘాతము.

మనది మాయానృతవాదయుగముగ నేర్పడినది. సర్వమతములవారును మతముయొక్క బాహ్యరూపములనె గమనించుచు దానిముఖ్యపథకముల నన్నిటిని విసర్జించుచున్నారు. ధనసంచయవిధానమునం దత్యాశచే నితరులకు తాము హాని చేయుచున్నామని కాని చేయగలమనికాని మఱతురు. రాక్ఫెల్లరుగారు ప్రపంచమంతలోను మిగుల ధనవంతులుగ నెంచఁబడుచుందురు. ద్రవ్యసంచయవిషయమున నాయన ధర్మపర్యాలోచన మెన్నఁడు గలిగియుండలేదని యెల్లరకు తెల్లమే. కేవల మతద్వేషము గలవారమని బహిరంగముగ జాటువారు కూడ యూరపు - అమెరికా ఖండములలో ననేకులున్నారు. ప్రపంచమందలి పాపసంచయమె మత మబద్ధమని తెలుపుటకు నిశ్చయమయిన ఋజువని వారు వాదింతురు. అదినిశ్చయముగ తప్పుటూహాగనున్నది. పనిచేయలేనివాడు పనిముట్లను నిందించునటుల తమ దురభ్యాసములకు మతము నుత్తరవాదిగ జేయుచున్నమాట నిజము. అట్టివారు పూర్తిగ బాధ్యతలేని జీవయాత్రను సాగించుచున్నారు.

నిరుత్తర వాదిత్వాభివృద్ధికి భయముచే గొందఱు వాని నెదుర్చుటకు బహిరంగముగ ముందుగ నిల్చిరి. మతము మా నుషహృదయముల పయి నధికారము పోగొట్టుకొను నెడల ప్రపంచమంతయు ధ్వంసమయి దగ్ధపటలమగునని వారు న్యాయమగు భయమందుచు జనుల నీతిమార్గమున వర్తింప జేయ విశ్వప్రయత్నముల జేయుచున్నారు. మతముయొక్క ముఖ్యపథకముల వివరముగ బరిశోధించినట్టియు అవియ న్నియు నొకేరీతి నీతియొక్క శాశ్వత పథకముల పయిని నిర్మింప బడినవని ఋజువుచేసినట్టియు నొక సంఘమును వారు స్థాపిం చిరి. అందుచే యేమతావలంబకుఁడయినను నాత్మవినాశనమున దక్క యా నీతిపథకము నతిక్రమింపఁజాలఁడు. ఈ సంఘో ద్దేశము మన యుగమున మంచిచెడ్డలతోఁబనిలేక మతమనిన మాత్రమున ద్వేషమును వహించు మనోవస్థను ఖండించుట యే యైయున్నది. సర్వమతము లొకేరీతి నైతికమూలపథక ముల నాధారపడి స్థాపితమయినవో శోధించుట కాసాంఘికులె దీక్షితులయి యున్నారు. నీతిధర్మమను పేర బరగినట్టియు లోక మునందలి స్త్రీపురుషులెల్లర శాశ్వతముగ బంధించు నీతి సూత్రములతో గూడినట్టియు, నొకక్రొత్త మతమును వా రేర్పరచిరి. ఏ సూత్రముల నాచరించుటవలన మానవజాతి క్షేమ మాధారపడి యున్నదో వానిని వివరించుటకు నీదిగువ పుటలలో యత్నించితిమి. వారి మనోకర్షణము గావించునట్టి సూత్రముల నభ్యాసముచే యత్నించుడని యీ చిన్నిపొత్త మును చదువు మా పాఠకమహాశయుల గోరుచున్నారము

వారామాత్రము పనిచేసినయెడల మా శ్రమకై పూర్ణబహుమానమును గాంచినటుల మేమెంచుకొనియెదము.



# నీతి బాధ్యత.



ప్రతిమానవ మనోమందిరమునకును రెండు గవాక్షము లుండును. అందొకదానివలన తానున్నస్థితిని, రెండవదాని వలన తానెట్లుండవలయునో యాస్థితిని, ప్రకటింపఁబడును. సామాన్యశాస్త్రములన్నియు బ్రపంచకముయొక్క యథాస్థితిని దెలుపుచుండ నీ నీతిధర్మశాస్త్ర మాప్రపంచమెట్లుండవలెనో వివరించును. తన యాంతరంగమును బరిశీలించి తన యథార్థస్థితిని గనుగొని శారీరక మానసి కాధ్యాత్మిక విషయంబుల నభివృద్ధిగాంచుటకై శక్తివంచనలేక వర్తించుట ప్రతిమనుజునకును విధ్యుక్తధర్మము. అన్యాయము, దుష్టత్వము, దంభము మొదలగు దుర్గుణములవలన కలుగు కీడుయొక్క సత్యమును గ్రహించి, వానితోఁబోర యావచ్ఛక్తిని వినియోగించవలెను. ఏదేని గృహముయొక్కపట మాయింటి నెట్లునిర్మింపవలెనో కనపరచుటకుమాత్ర ముపయోగపడునటుల నీతిధర్మబోధనలు మనజీవితములయొక్క నిత్యాచరణవిధానముల నెంతదనుక నియమించునో యంతదనుక దెలుపుటకుమాత్ర ముపకరించుచుండును. నిత్యాచరణమున నుండని నీతిసూత్రములన్ని

యు నిరర్థకములు. నీతిసూత్రముల రాలవలె కంఠపాఠము జేసి వానిని గట్టిగ నేకరవు పెట్టెడు వారిననేకుల గాంచుచున్నారము. కాని యెందరును వానినాచరణములో నుంచు బుద్ధిగలవారుండరు. నీతిసూత్రములన్నియు పరలోకసాధనకుమాత్రము ఉపకరించునని యెంచువారు కొందరు గలరు. నీతిపథకముల నిరాఘాటవిధేయతయుం దుండ తన జీవితమున కుత్తరవు చేయ సిద్ధపడనివాడు మనుష్యశబ్దార్థమును సార్థకము చేయఁజాలఁడని ఘంటాపథముగ నిర్ధారణ చేయగలము. ఈలోకములో మన మనుభవించవలసిన కష్టనష్టములతో బనిలేకుండ బుణ్యాభ్యుదయములలో సౌఖ్యమును కనుగొన మనమెల్లరము శక్తిగలిగి యుండవలెను.

దేవుఁడు సర్వశక్తుఁడు. ఆయన సంపూర్ణతామూర్తియయి యున్నాడు. ఆయన న్యాయకృపాగుణముల కెవ్వరును పారమేర్పరింపఁజాలరు. ఆయన భక్తులమని నుడివెడి మనము నీతిబాధ్యత తొలగుటకెట్లు సాహసింపఁగలము. ఫలాపేక్షయా నీతియుక్తమగు జీవయాత్రను నిశ్చయముగ గడుపఁజాలము. యోగ్యజీవనము మనకు మేలుచేయునను భావముతోగాక సయ్యది శాశ్వతమయి నిర్వికారమగు ప్రకృతిపథకమగుటను మనకాచరణీయముగ విధింపఁబడినది. సత్కార్యములు నిశ్చయముగ మన కన్నవస్త్రములకంటెను మిగుల ఘనతరములుగ నున్నవి. మనకాకలియగునపు డన్నమిడినవారియెడలకంటె సత్కార్యాచరణావకాశ మిడినవారియెడల మన మెక్కుడు కృతజ్ఞులముగ నుండవలెను.

డాబుదర్పములె ప్రధానముగ నెంచుకొనువాడును, లోకములో గొప్పవాడనిపించుకొన నాతురుఁడగువాఁడును, నెన్నఁడును నీతిమార్గావలంబి కాఁజాలఁడు. శౌచము జ్ఞానము పాటు మొదలగువానియం దెంతమాత్రము నీతిధర్మ మిమిడి యుండదు. నిశ్చయముగ నివియన్ని యుప్రత్యేకముగ సన్మార్గాంతర్భాగములే. కాని యివి యేమనుజునిగాని నీతిపథగామిని గావింపసమర్థములు గానేరవు. నిజమగు నీతిమార్గానుయాయి తన కందువలన ప్రయోజనముకలదని కాదుగాని, అది తనకు ప్రకృతిసిద్ధమగు ధర్మమనియు తనయుచ్ఛ్వాసవాయువువంటి సహజధర్మమనియు, యోగ్యజీవనముచేయును. వేయేల యోగ్యకర్మలు ఫలాపేక్షారహితములు.

---

## అత్యున్నత నీతిపథము.

ఈ దినములలో నీతిపథమునుగూర్చి జనాభిప్రాయములు దృఢగాంభీర్యములుగ నుండునని చెప్పఁబడఁజాలవు. ఇందుకు దృష్టాంతమును గనుఁడు. మానవునకు నీతిమార్గావలంబనాగత్య మెంతమాత్రము లేదని కొందరెంతురు. మతమునకును నీతిపథమునకును సంబంధమే లేదని మఱికొందరందురు. కాని యథార్థముగ నీతిపథములేక మతమే యుండనేరదు. నీతిమార్గానువర్తనమే యవశ్యధర్మమని యెంచి

ధానిని నవలంబించువారలె నిజముగ దైవభక్తులుగ పరిగణింపఁ బడవలెను. స్వదేశక్షేమమునకై తమజీవితముల ధారవోయ సంసిద్ధులయినవారలె నిజముగ నున్నత నీతిపరులగుదురు. ఇందు కుదాహరణముగ జనసామాన్యమునకు విద్యావ్యాపనము గావింప కఠినముగ పాటుబడినట్టియు, కారాబద్ధుల జీవనముల సంస్కరించుట కెన్నిశ్రమలకోర్చియయిన బ్రయత్నించినట్టియు, స్వదేశీయులక్షేమమునకై యనేకచట్టముల నిర్మాణముగావింపఁ బ్రధానకారకుఁడయినట్టియు, జర్మ్నిబెంతమ్మను మహానీయుఁ డత్యున్నతనీతిపథగామియని చెప్పఁబడనొప్పును.

పలువురు నడచుటచే నలిగిన ప్రాతత్రోవల ద్రొక్కుటమాత్రమే నిజమగు నీతిపథముకాదు. కాని మనమందు తనువగు సత్యమార్గమును స్వయముగ గనుగొని యందు నిర్భీతిగ జనవలయును. సత్యమం దట్టి బలవత్తరావలంబనము లేనియెడల నిజమగు యభివృద్ధి యసాధ్యమగును. అనగా నభివృద్ధి సంస్కారము లనిశము నీతిధర్మబద్ధములయి దానితో నవి నాభావములయి యుండును.

మన కోరికలు నుద్దేశములును రెండుతరగతులుగ విభజింపఁబడుచున్నవి. స్వప్రయోజనయుక్తములు, పరోపకారాయత్తములునని. స్వప్రయోజనయుక్తములగు కోరికలన్నియు దుర్నీతిదాయకములు. కాని పరుల కుపకారముఁ గావింప నాత్మాభివృద్ధినొందు కోరిక నిజముగ నీతిసమ్మతము. మన మొరులకు గావించిన యుపకారములనుగూర్చి పొగడుకొనసాగినను వాని

నిఁగూర్చి గర్వోక్తులు పలికినను, మనము నీతిదూరుల మగుదుము. సత్కార్యాచరణము ధర్మమని సత్కర్మలఁ జేయ బలవత్తరప్రయత్నుఁడగుటయందే పుణ్యమున్నది.

ఆగ్రహము, అనృతము, కలహము, మొదలగు దుర్నీతిబీజములకు తావొసఁగ నంగీకరించిన మనుజుఁడుగాని కుటుంబముగాని శాశ్వతవినాశనము గాంచును. మంచిని జేయు శక్తి మనకు బాహ్యమునుండి రానేరదు. అది యెల్లపుడు మనలోపలనే యున్నది. దానిని యుక్తసాధనములచే మనమభివృద్ధి మాత్రము గావింపవలసియుండును. మానవజాతి క్షేమమునకయి మన మనవరతము పాటుపడవలయునను విషయమె మహోన్నత నీతిపథకమని మనము కనుగొనుచున్నాము. ఈప్రధానమగు సత్యమును మనమొకసారి గ్రహించినపు డితర నీతిపథకములన్నియు స్వయంప్రకాశములయి తోఁచును.

---

# సత్కర్మయననేమి?

---

చాలవరకు మనమెల్లరము గతానుగతిక లోకసంప్రదాయాచరణ పరాయణులముగ నుందుముగాన మన సామాన్యకర్మములలో ననేకములలోనికి నీతిప్రసంగ మెంతమాత్రము చేరకుండును. నిశ్చయముగ ననేకాంశములలో సంప్రదాయసిద్ధముల నవలంబించుట ముఖ్యమైయున్నది. ప్రతిమనుజుఁ

డును తనస్వంతమార్గమునే యవలంబించునెడల నీప్రపంచ మున గందరగోళస్థితికంటె నన్యముండనేరదు. ఆచారసంప్రదాయములలో దేనినయిన మూఢముగ ననుసరించుట నీతిమార్గవిరోధమగును.

ఐచ్ఛికముగాని కర్మమెద్దియును నీతియుక్తమనబడగదు. కేవల యంత్రప్రాయులమయి మనము వర్తించునెడల నీతిమార్గప్రసంగమవసరము కానేరదు. ఏకర్మనుగాని నీతియుక్తమని యనగోరుదుమేని యది మనఃపూర్వకముగాను, విధ్యుక్తధర్మముగను దానినొనర్చి యుండవలెను. జ్ఞానకృతకర్మలకును నజ్ఞానకృతకర్మలకును భేదముకలదు. ఒకయపరాధికి క్షమాపణపత్రము నొసంగిన రాజు సత్కార్మ గావించినవాడగును. కాని యాక్షమాపణపత్రమును గొనిపోయిన రాజభటుడు రాజుచేత కేవల మొకపరికరప్రాయుడగును. కాని యాభటుడు రాజుగారి క్షమాపణపత్రమును తన విధ్యుక్తధర్మమని తలంచుకొనుచు గొనిపోవునేని, వాడు పరికరప్రాయుడగుట మాని వానికర్మము సత్కార్మమగును.

తన స్వబుద్ధి నుపయోగింపక నలువురునడుచు దోవనే యవలంబించువాడు నీతియు, యోగ్యతయు ననునేమో యెన్నండును తెలియజాలడు. లోకములోని మహాపురుషులెల్లరును లోకోపకారము గావించుటకై యేర్పడిన సంప్రదాయములకుగాని, స్థాపితములగు నాదృశ్యములకుగాని, వ్యతిరేకముగ బ్రవర్తించినవారుగనె యున్నారు. తన యభిప్రాయముల నేర్పరచుకొనుటయందును, వాని బ్రకటించుటయందును, నిర్భీతుం

డుగానట్టియు, తనయంతరాత్మ యుద్బోధనల నిరాఘాటముగ మన్నించునట్టియు, నేమనుజుఁడుగాని సుగుణశీలుఁ డనఁబడ నేరడు. అంతరాత్మ యుద్బోధనలె దైవబోధనలనియు, తన ప్రతికర్మయొక్కయు, యోచనయొక్కయు మంచిచెడ్డల కదియె కడపటితీర్పుకర్తయనియు, సత్యగ్రహణము చేయకుండునంతకాల మది యసాధ్యముగ నుండును.

విశేషించి యొకకర్మయొక్క యోగ్యతాయోగ్యతలు తీర్మానించునపుడు కర్తయొక్క యుద్దేశమును పరిగణింప వలయును. ఒకేకర్మ దానిని బురికొలుపు యుద్దేశముల ననుసరించి సత్కర్మయో దుష్కర్మయో యగుచుండును. ఇందుకు దార్కాణముగ నిరువురుమనుజులు బీదల కన్నప్రదానము గావించు నభ్యాసము కలిగియుండిరని యూహింతము. అందొకఁడు కరుణాళుఁ డగుటచేతను, రెండవవాఁడు పేరుప్రతిష్ఠలు సంపాదింపనో, గొప్పతనము బడయుటకో, మరి యేయితర మగు. యాత్మప్రయోజనాపేక్షకో యనుకొందము. వారిరువు రొక కార్యమునే జేసిరి. ఈరెం డువిషయములలోను కర్మయొక్కతీరె యయ్యును మొదటివిషయమున నదినీతియుక్తము. రెండవదానియందు దుర్నీతియుక్తముగ నున్నది. కాన నీతియుక్తమగు యుద్దేశముచేఁ బురికొల్పఁబడిన యేకర్మయును నీతియుక్తమనఁబడ నేరదు. సత్కర్మ లనిశము సదుద్దేశప్రేరితములని నుడువజాలము.

సత్కర్మయొక్క ఫలితము మనకదృశ్యముగగాని, యననుకూలముగ గాని, తరుచు గనఁగొనుచుందుము. అయి

తనుమనకర్మల ఫలితములనుగూర్చి యోచించుట మనకెంత మాత్రమును జోక్యము లేదు. మనయుద్దేశ మకల్మషమనియు, చేసినదిసత్కార్మయనియు మాత్రము మనంతటమనము నిర్ధారణచేసికొని మిగతను దైవముపయి విడిచిపెట్టవలెను. అలెగ్జాండరుచక్రవర్తికి చరిత్రకారులు మహద్బిరుదము నాతనిపేరునకు ముందు జేర్చిరి. అతఁడేగిన చోటులనెల్ల గ్రీకుదేశపు విద్యలను, కళలను, శాస్త్రములను, గ్రీకులనడవడులను, యాచారములను, స్థిరపరచెను. అవి నిరాఘాటముగ సత్ఫలప్రదాయినులయ్యెను. కాని యాతనియుద్దేశము వీనినన్నిటిని బట్టి పేరుసంపాదించుటయై యుండెను. ఇట్టిస్థితిలో వానికర్మలు నీతియుక్తములనియెట్లు దెలుపగలము? అతఁడు యుద్ధవీరుఁడుగాని, పరిపాలకుడుగగాని, మహద్బిరుదమున కర్హుఁడెయగునుగాని మహామహుఁడు లేక సుగుణపూర్ణుఁడని తెలుపఁబడనేరఁడు. ఎయ్యదిగాని స్వతస్సిద్ధముగ సత్కార్మయయ్యెనేని, సదుద్దేశప్రేరితమయ్యెనేని, యదిపూర్ణముగ నైచ్ఛికమయినతప్ప, నీతియుక్తమని చెప్పఁబడనేరదని, పైనుదహరించినదానినుండి తేలుచున్నది. ప్రాతఃకాలమున బెందలకడ నిద్ర మేల్కాంచనిచో నుద్యోగస్థానమునకు బోవుటాలస్యమగుటచే నాయుద్యోగము పోవునను భయమున నట్లుచేయుటవలన పుణ్యము లేదు. అటులనే కేవలభోగానుభవమునకు తగుస్థితి లేకుండుటచే నేను నిరాడంబరజీవనము చేసినయెడల నందుపుణ్యములేదు. కాని నేను ధనవంతుఁడనయి యుండియు, నాచుట్టునుండు బీదసాదలకులేని సుఖభోగముల నే ననుభవించుట పాపకార్యముగ

మందునను విశ్వాసముతో నిరాడంబరజీవనముచేయ నేను స్వేచ్ఛగ నెంచుకొనునెడల నాకర్మ సత్కర్మగనుండును. అదేతీరున నాసేవకులు పనిలోనుండి మానుకొందురను కేవల భీతిచే వారిజీతములను వృద్ధిజేసితినేని నేను సన్నీతిపరుఁడ ననఁబడనేరను కాని నాయనుచరులతోపాటు నాసంపాద్యమును పంచికొనుచుట నావిధ్యుక్తధర్మమనియెంచి వారిజీతముల వృద్ధిగావింతునేని నాకర్మ నీతియుక్తమయినదగును. ఆరీతినే భయమువలనగాని, మరియేవిధమయిన బలవంతముచేగాని కేడింపఁబడిన ప్రతికార్యము నీతిదూరమగును.

ఆలాగుననే యత్యుత్కృష్టకర్మలు సయిత మాత్మలాభాపేక్షాకలంకదూషితములగుచో నీతియుక్తములుగ నుండనేరవు. నిశ్చయముగ స్వప్రయోజనయుక్తములగు కర్మలన్నియును నగత్యముగ చెడ్డవికానేరవు. కాని వానిని నీతియుక్తములనుట నీతిమార్గదూషణ మగును. నిశ్చయముగ యథార్థవాదిత్వ మాచరణీయమార్గములలో సర్వోత్తమముగ నున్నది. కాని తాను వర్తించుమార్గము నారీతిని శ్లాఘ్యముగావింప యత్నించువాడు సన్నీతిపరుఁడు కానేరఁడు. అటులనే ప్రేమ దివ్యధర్మముగ నున్నది. కాని యయ్యది స్వప్రయోజనపరత కాధారమగునెడ ధర్మముగనుండ మానును. వికారహేతువులలో కూడ నిశ్చలమయి నిలచునదియే ప్రేమయని షేక్స్పియరు మహాకవివరుఁ డందముగ వర్ణించి యున్నాడు.

పరలోకమున సౌఖ్యదాయకములను నాశచె ప్రేరిత

మొలగు సత్కార్యము లన్నియును నీతిధర్మేతరములనికూడ తేలుచున్నది. సత్కర్మను సత్కర్మయని మాత్రి మాచరించు వాడుమాత్రము నిజమగు ధర్మపరుఁడుగ నుండును. తేన భక్తికై ప్రతిఫలమును స్వప్నావస్థయందైన నపేక్షించని మను జుడే దైవభక్తుడుగ నుండును. అందుచే తన మిత్రులకు సత్య సంధుడుగను శత్రుల కసత్యవంతుడుగనుండువాడు పిరికివం దగ నెంచబడవలెను.

ఇప్పుడొక కర్మయొక్కధర్మము దానిని చేసేచు నుద్దేశ ముల స్వభావమునే మూలాధారము గావించుకొని యుండును. మానవహృదయమునఁజొచ్చి వాని మనోభావముల గనిపెట జాలము గాన వాని కర్మలనుగూర్చి నిర్ధారణము గావించు టనిశము కష్టముగనుండును. కాన నీఘనశోధనలచే మన సర్వమనోభావములును బ్రకాశితములుగ నుండవలెను.

---

# అన్ని ధర్మములకంటె నతీత ధర్మము.

---

ఒక కర్మయొక్క మంచిచెడ్డల నిర్ణయించుటయందొక నైతికప్రమాణమును సహజముగ ననుసరింతుము. ఒక కర్మను సత్కర్మయనిగాని దుష్కర్మయనిగాని యనుటలో నది లాభ కారియా? నష్టప్రదమా? యనిమనము యోచింపము. మనము యుక్తాయుక్తముల నిర్ణయించుట జాగ్రదేతరావస్థలయందు

మనము స్వీకరించిన పూర్వవాసనా లబ్ధభావముల పయి నాధా రపడి యున్నది. ఒక మనుజు డింకొకని కేదయిన యపాయము చేసినయెడల నందువలన మన కేనష్టము కలుగకపోయినను దానిని మనము నిరసింతుము. కొన్ని యెడల నాదుష్కార్య కర్తకు సానుభూతి కనపరచుటకూడ దటస్థమగును. కాని యెప్పుడు కూడ వాని కర్మల నిరసించుటకు సంశయించము. అన్నికర్మల యుద్దేశమును మనము పరిశీలింపజాలము. కాన మన తీర్మానములలో దరుచు మనము పొరబడుచుందుము. అయినను నది మనకు కొంతమేలు కలిగినప్పటికిని దుష్కా ర్మను దుష్కార్మగానే యనివార్యముగ నెంచుదుము.

ఒక కర్మయొక్క నైతికప్రయోజనము మన స్వంత యిష్టానిష్టముల నాధారముచేసికొనియుండదని స్పష్టమగు చున్నది. తరుచుగ మన సానుభూతులు నిజమగు నీతిమార్గము నకు భిన్నముగనున్నట్లు నిశ్చయముగ గనుగొనబడుచున్నవి. మనబిడ్డ కేదేని నొకవస్తువునిచ్చుటకు మనప్రేమ మనల బురికొలుపును. కాని యావస్తు వాబిడ్డ కపాయకారియగు నెడల దాని నాబిడ్డ కొసగుట ధర్మదూరముగ నుండును. నైతికో ద్దేశములవలన ఉచితముగ బద్ధమయియుండినదప్ప ప్రేమ విషముగ బరిణమించును.

నీతిధర్మముయొక్క మరియొకలక్షణ మది శాశ్వతము గను నిశ్చలనముగను నుండుటయే. అది యన్ని దేశముల యందును నెల్లజాతులయందును వర్తించును. సూర్యుడు మన కన్నులు తెరచి యుండినపుడు మన కగుపడును. కన్నులుమూసి

కొనునవు డదృశ్యుడగును. ఇది సూర్యునియం దేమార్పునుసూ
చింపదుగాని మనదృష్టియందుమాత్ర మట్టిమార్పును దెలుపును.

ఆతీరుననే యజ్ఞానతిమిరాంధులమయి యుండునంతకాలము నీతిధర్మముల సత్యగ్రహణమును చేయఁజాలము. కాని మనదృష్టి నిర్మలినమయినపుడు వానిసత్యమును గ్రహించుటలో నించుకయిన కష్టమును గనజాలకుందుము. అనేకులు తమదృష్టి యాత్మలాభతిమిరపటలాంధీభూతమగునపుడు దుర్నీతిని సన్నీతిగను, దోషమును గుణముగను, పాపమును పుణ్యముగను, విపరీతముగ నెంచుచుందురు. మనుజులు తమ స్వలాభాయత్తములగు నుద్దేశముల వీడి నీతిధర్మమునందే తమదృష్టిని నిలుపుసమయ మత్యాసన్నమగుచున్నది. నీతిశాస్త్రమింకను ప్రాథమికదశయందున్నది. జనులు నేటిదనుక బాహ్యప్రపంచిక వికారపరిశోధనమునందె యామోదము గలిగి యుండిరి. నైతికప్రపంచపరిశోధనల నిర్భీతిగగావించువార లిప్పటికి లేరు. ప్రకృతిశాస్త్రములయెడల నెట్టి నిష్కామ్యశ్రద్ధతో బరిశోధనలగావింప తమయావజ్జీవముల గడపుచుండిరో యట్టి పూనికతో పాటుపడ సిద్ధముగనుండిరేని నీతిమార్గముయొక్క సత్యధర్మములనుగూడ కనుగొని నిర్ణయించుటకును, వానినొక క్రమముగ నిరూపణగావించుటకును నవకాశముండును.

నీతి ప్రపంచకముయొక్క ధర్మములు మన యభిప్రాయముల నుద్దేశముల నాధారముచేసికొని యుండలేదు. అవి మనుష్యకృతచట్టములవలె నస్థిరములుగ నుండవు. కాని శాశ్వతముగ చెల్లదగినవిగ నుండును. కావున రాజ్యాంగశాసనముల

కంచును నధికశ్రద్ధతో వాని మన్నింప బాధ్యులముగ నున్నా రము. రాజ్యాంగశాసనోల్లంఘనముగావించి తద్దాగ్రహపాత్రు లగుటకు వీరాంగీకరింపవచ్చును. కాని నీతిశాసనముల నుల్లం ఘించి భగవదాగ్రహపాత్రులగుటకుమాత్ర మెన్న డంగీకరింపఁ జాలరు. ఎన్నఁడయిన రాజ్యాంగశాసనములు నీతిధర్మవిరుద్ధము లగునేని యట్టియెడల నిశ్చయముగ రాజ్యాంగ శాసనోల్లంఘ న మనతిక్రమణీయవిధ్యుక్త ధర్మమగును.

రాజ్యాంగశాసనములకును నైతికశాసనములకును గల గొప్పభేదము నీతిధర్మములు ప్రతిమనుజుని యాత్మపీఠమున నధి ష్ఠించియుండుటమాత్రమే యయియున్నది. సత్యము మన లోపలనేయున్నది. మన యెల్లరహృదయకేంద్రములందును నతి గంభీరస్థానమున సత్యము పరిపూర్ణముగ భాసిలుచుండును. ప్రతి దుష్కార్మాచరణకర్తయు తాను దుష్కర్మను జేయుచున్నానని తనయంతరంగమున నెఱుఁగును. ఏలనన నసత్యమును సత్య ముగ భ్రమింపఁజాలఁడు. మిగుల భ్రష్టులగునట్టియు, నెన్నఁ డును నీతిధర్మములకు విధేయులుగానట్టియు, జనులు సహితము నీతిబాధ్యతను గుర్తించియుండుటచే తాము పుణ్యాత్ములని గాని, నీతిపరులనిగాని యనిపించుకొనుటకు గర్వము జెందుచు న్నారు. నిశ్చయముగ నీతిధర్మముయొక్క మహావైభవమి దియే. ఆచారమును లేక సాంప్రదాయమునుగాని, జనసామా న్యాభిప్రాయమునుగాని యదియెన్నఁడును పరిగణనము చేయ దు. మిగుల తరుచుగ సంప్రదాయము నీతిధర్మముతో నెన్నఁడు నమీకరింపఁబడనేరదు. సత్యమునుగూర్చిన తన యభిప్రా

క్షణము జనసామాన్యాభిప్రాయవిరుద్ధమగుటచే, సోక్రిటీసను జ్ఞాని సత్యమునకుబలియై మృతినొందెను. ఏసత్యముకొరకు తన ప్రాణమును బలియొసఁగెనో యయ్యది యెన్నఁటికిని సత్యముగనే యుండియున్నది. అది యెన్నటికిని తప్పక యట్లేయుండును. సత్యపుణ్యములు శాశ్వతముగ భగవత్సామ్రాజ్యమున ధర్మశాసనములుగ నుండవలెను.

ఏమనుజుఁడుగాని, జాతిగాని, నీతిశాసనమును శిక్షాభయవిరహితముగ నుల్లంఘింపఁజాలఁడు. దొంగవాడు తనయాత్మధనమునే గోల్పోవును. మోసగాడు తన్నుతాన మోసముగావించుకొనును. పాపము కొంతకాలమువరకు జయముగాంచవచ్చును. కాని యెన్నఁడో త్వరగనో యాలస్యముగనో భయంకరవినాశము దానికై యెదురుచూచుచుండును. అస్సీరియా, బాబిలోను, సామ్రాజ్యములు పాపమువలన వినాశనమును గాంచినవి. గ్రీసు–రోముదేశములు ధర్మపథము విడిచినప్పుడు మిగుల జ్ఞానులగు మహామహులునయితము వాని విధ్వంసమును రక్షింపఁజాలకుండిరి. ఫ్రాన్సుదేశపు రాజ్యవిప్లవ మాదేశమును చిరకాలము పీడించిన నిరంకుశత్వమను పాపమునకు ప్రతీకారకారణమయ్యెను. ఇందుకు వ్యత్యయముగ ధర్మమార్గానుయాయియగు మనుజుఁడెల్లప్పుడు గొప్పతనమునే గాంచును. ఈ పని చేయు కుటుంబముగాని, సంఘముగాని, యభివృద్ధిజెందును. ధర్మశాసనముల నవలంబించు జాతిపయిని శాంతి, స్వేచ్ఛాసౌఖ్యములను, వరములను ప్రసాదింపఁబడకెన్నఁడు తప్పిపోకుండును.

---

సున్నా
తు

# మతము — నీతి.

నీతిమతములు కేవల భిన్నములని జనసామాన్యాభిప్రాయము కనబడుచున్నది. కాని యీపొత్తమున నట్టిభేదమును పాటించియుండలేదు. మతము నీతిధర్మమున నంతర్భాగము కాదనువారును, నీతిమార్గమునకు మతప్రసక్తియే లేదనువారును, ప్రాయశః నన్నందునకు నిందించిన నిందించవచ్చును. అయిన నీరెండింటికినీ ముఖ్యసంబంధముకలదని నొక్కి వక్కాణింప సాహసించెదను.

జనసామాన్యాభిప్రాయము ననుసరించి విమర్శించు నెడల మతము నీతిమార్గమున కేవిధమయిన సంబంధమును లేనిదిగ గన్పట్టును. కేవల నీతిబాహ్యకర్మల నాచరించుచు, మతాభిమానులమని గర్వించు దాంభికులగు దుర్మార్గుల నెందరనో గనుచున్నారము. ఈరీతిని కీర్తిశేషులగు బ్రాడ్లా మున్నగు కొందరు పుణ్యమార్గానుచరులును సన్నీతిపరులును నయ్యును నాస్తికులమనుచు గర్వించుచున్నారు. ఈరెండును దురభిప్రాయములుగ నున్నవి. కాని మొదటితెగవారు తమదౌర్జన్యమును మతవేషముచే గప్పిపుచ్చుదురు. కావున సంఘద్రోహు లగుచున్నారు. మతమును, నీతిధర్మమును, నవినాభావములుగ నుండవలెను.

పూర్వకాలమునందలి జనులు కేవల సాంఘికబంధములచేఁ గట్టుపడియుండిరి. అనగా వారు సాంఘికజీవనమున కవసరములగు నగత్యములనే పాటించువారు. ధర్మమే జయమందు

వనియు, దుష్కార్యకర్త తుదకాత్మవినాశనమును గాంచు ననియు, కాలక్రమమున వారు గ్రహింపగలిగిరి. ఈవిధమున నాత్మరక్షణార్థమగు సహజప్రవృత్తి మానవుని నైతికబీజాభివృద్ధి హేతువయ్యెను. మతవిషయిక మనోభావములు మానవ హృదయాంతరస్థితములయి యుండక తద్బాహ్యప్రదేశముల యందే యుండును. మన కేదయిన కీడుగాని, విపత్తుగాని, మూడునెడలమాత్ర మా విషయమున తీవ్రముగ యోజింపఁ సాగుదుము. భయజనితమగు భగవద్భక్తి భక్తియే కానేరదు. సత్యాసత్యములలో నెయ్యది గ్రాహ్యమో యెన్నుకొను కాలము ప్రతిమానవునకు తటస్థమగును. అప్పుడు ఫలితములతో బ్రసక్తిలేక చెడుగును విడిచి మంచిని గ్రహించి యనుసరించుటకు మనఃపూర్వకముగ నిశ్చయము గావించుకొనవలెను. అపుడుమాత్రమె వాడు నీతితత్వముయొక్క సత్యమును గ్రహించెనని చెప్పనొప్పును. మతమును విడనాడనేని యట్టి నీతి కేవల కపటయుక్తమని విస్పష్టమగును.

పరులకు హానిచేయుటవలన స్వార్థమును సంపాదింప గలిగినను మనమట్టిపనిని చేయరాదు. ఏలనన దుష్కార్యాచరణమువలన మనము పొందెడిమేలు మేలువలె తోచినను నిజముగ నదిమేలేకానేరదు. తనయాత్మను గోల్పోయి ప్రపంచమంతయును సంపాదించినను యది మనుజున కేమిలాభమును కలుగజేయును. బిస్మార్కనువాడు జర్మనీదేశము నైహికముగ నభివృద్ధి గాంచుటకనేకదుష్కర్మల నాచరించెను. సామాన్యముగ నతఁడు యువకులు తన బోధనాచరణములో నుంచుట

కాలఁజేల యోచింపకుండెను. అతని నైతికధర్మము మతమును విడనాడియుండుటచే నిజమయిన నీతిమార్గము కానేరదని సువ్యక్తమగుచున్నది. నేలపాతిన బీజమున కుదక మెట్టిదో నీతిధర్మమునకు మత మట్టిది. నీరులేనియెడల బీజము భూమిలో నెట్లు పొట్లిపోవునో యట్లే మతదోహదవిహీనమగు నీతికృశించి క్రమముగ నశించును. సత్యమయిన మతమును నీతిమార్గమును నవినాభావముగ నొండొంటితో సంబంధించియున్నవని స్పష్టమగుచున్నది. అనగా మతవిహీనమగు నీతిధర్మము శుద్ధశూన్యము. ప్రపంచమునందలి గొప్పమతములవలన శాసింపఁబడిన నైతికప్రవర్తనాపథకములన్నియు నభేదములయి యొకేరీతినున్నవి. గొప్పమతబోధకు లెల్లరు మతము నీతిపై నాధారపడియున్నదని యుద్ఘోషించియుండిరి. పునాది దిట్టము చెడినప్పు డొక మేడ నేలగూలిన పడువున మతములన్నియు వానిమూలాధారమగు నీతిధర్మములు సంచలించినపుడు ధ్వంసమూలియగును.

పయినిచెప్పిన దానినిబట్టి మతమునకును నీతికి నభేదాధ్యవసాయమని తేలుచున్నది. సత్యగ్రహణ ఋజుమార్గవర్తనములే సర్వోత్కృష్టమతము. భగవన్నామోచ్చారణము గావించుచు దుష్కార్యాచరణమొనర్చితిమేని యాభగవదనుగ్రహంబును సంపాదింపఁ జాలుదుమా? ఒకడు భగవంతుఁ డున్నాడనినుడువుచు నసత్యనీతిదూరజీవనము చేయుచున్నాడనియు, నూహించుము. ఈ యిరువురిలో నెవఁడు నిజమగు దైవభక్తిని, నీతియుక్తిని కలిగియున్నాడో, నిర్ధారణముగావింప వారిలో నెసంశయముయిన నుండునా? భగవంతుని కేవల వాఙ్మాత్రా

ధవముగావించు మొదటివాడు నాస్తికాధమునికంటె నధముఁడు. రెండవవానిని దేవుని శాశ్వతిమయినట్టియు, నిశ్చలమయినట్టియు, శాసనములను శిరసావహించుటచే గొప్పదైవభక్తుఁడని తప్పక చెప్పవలసియున్నది. నైతికశాసనానుశరణమే మతశబ్దార్థముగనున్నది.

## డార్విను — నీతిధర్మము

ఐచ్ఛికముగను మనఃపూర్వకముగను సత్కార్మాచరణములో నిజమగు ఘనత యిమిడియున్నది. ఎవ్వాఁడు విషయాతరంగాఘాతుఁడు గాకుండు, నెవ్వాఁ డహంకారమహావాతప్రచలితుఁడుగనుండు నెవ్వాఁడు ఋజుమార్గమని తాను గుర్తించిన దాని ననుసరింపఁదగు మనస్థైర్యము శక్తియుక్తులు గలిగియుండు నాతఁడె మానవుఁడననొప్పును. ఎల్లవారును జితేంద్రియులు కారు. బాహ్యప్రపంచకమున కనుకూలముగ మనము వర్తింపక తప్పదు. బాహ్యప్రపంచానుకూలముగ మనము వర్తించునపుడు నీతిపథకముల ననుసరింపవలయునా? లేక బాహ్యప్రపంచమన నెట్లుత్రిప్పిన నట్లు చేయవలయునా? యను ప్రశ్న కలుగుచున్నది. ఈ సందర్భమున డార్వినుగారి మతమెంతవరకు ప్రమాణముగ నిలుచునో యోజింపవలసియున్నది. డార్వినుమతము ననుసరించి యస్వార్థతిమములె నిలచునేనునది ప్రకృతిధర్మము. మనుజుఁడును హీనజంతువులనుగూడ నాత్మరక్షణము

నేకయి నిరంతరము పోరాడుచుందురనియు, నంద స్వార్థతమములె నిలచుననియు, నస్వార్థములు నాశనము గాంచుననియును యీ మతసారము. నిలచుట కనన్యగతికసాధనమయిన, యస్వార్థత కేవలము శారీరకమానసిక బలములలో నొకటయినచో మానవవ్యాపారములలో నీతిమార్గమునకు తావుండదు. అస్వార్థత యున నిజముగ నిదియేనా? నీతిధర్మమునకును బాహ్యప్రపంచకమునకును ముఖ్యసంబధముకలదని డార్విను గారె స్వయముగ తెలిపియున్నారు.

మనుష్యుఁడు, ఎలుగుగొడ్డు, దున్నపోతు, మొదలగు యితరజంతువులకంటె దేహబలమున తగ్గియున్నాడని స్పష్టమె. పయిజంతువులతోఁ బోరునెడ వానికతఁడోడిపోవుట నిశ్చయము. అయినను మానసికాధిక్యతవలన మనుజుఁడు వాని వశవర్తులుగ గావించుకొనియుండెను. అటులనే మనుజులలో పయితె మొక పోరాటమున నధికసంఖ్యలు జయనిశ్చయమునకు జాలియుండవు. విస్తారముగ మానసికశక్తిగల కక్షివాద పరిమితసంఖ్యాకుల పయినే జయమునందగలరు. కావున మానసికశక్తి దేహదార్ఢ్యముకంటె నిరాఘాటముగ బలవత్తరమయి యున్నది.

డార్వినుగారంగీకరించినటుల నైతికబలము మానసికబలముకంటెనయితమధికబలముగ నున్నది. నైతికార్హతగలవారలె ప్రపంచకమున దుదకు బలవంతులు. కేవల శారీరకధర్మముల యాధిక్యతనుగూర్చియె డార్వినుగారు బోధించిరనియు, కాబట్టి నైతికధర్మము ప్రపంచకర్మమున తావొసఁగబడియుండలేద

నియు కొందరుజను లభిప్రాయపడుచున్నారు. కాని యిది కేవలము తప్పుటూహ. ప్రాపంచిక చరిత్రాపరిశోధనమువలన నైతికపథకములు శిలాక్షరములవలె శాశ్వతములని తెలియవచ్చుచున్నది. సత్యమును, జయమును, చిరస్థాయులుగ నున్నవి. అసత్యమున న్యాయమును చిరస్థాయులయ్యును ఘోరించి విప్లవమువంటి మహాప్రళయముల కతమున వినాశమును జెందుచుండును.

నైతికధర్మాధికతను ఋజువుచేయుటకు సామాన్య జీవితములనుండి దృష్టాంతరముల గనబరచ వచ్చును. ఇందు కుదాహరణముగ నణకువ ముఖ్యముగ నైతికయోగ్యతగ నున్నది. గర్వియు తలబిరుసుమానిసియు కొంతవరకు జయమును గొనవచ్చును. కాని తుదకాతడు బాధ జెందవలసియుండును. భోగపరాఙ్ముఖత దోషదూరతకూడ నింకొక నీతిధర్మముగ నున్నది. ఆంగ్లేయ దేశమున ముప్పది, ముప్పదియైదు సంవత్సరముల ప్రాయమున త్రాగుడు నభ్యసించినవారు సగటున మరి పదమూడు పదిహేను వత్సరము లధికముగమాత్రము జీవింతురనియు నామరభ్యాసదూరులు డెబ్బది సంవత్సరముల ప్రాయమువరకు జీవింతురనియు జనాభాలెక్కల వలన దెలియుచున్నారము. మరియు వ్యభిచారము మిగుల ఘోరమగు నైతికదోషము. ఆదోషమును గావించువా రకాల మరణమును గాంతురు. అట్టివారు సంతానవంతులగుచో నా సంతానము మిగుల నీరసముగను బలహీనముగ నుండును. వారొడలు ముదిరినకొలది బలహీను లగుచుందురు.

వివిధజాతుల దృష్టాంతములవలన నీతిపథకములయొక్క వ్యాప్తియెంత నిర్దుష్టస్థిరభావముగ నున్నదోకూడ చూడగలము. ఇందుకు తార్కాణముగ నండమానుదీవులలో సంతానలాభానంతరమున పురుషులు తమభార్యల విడచుచుందురు. అనగా వారు కేవల మాత్మలాభోద్దేశములవలన నడుపబడుచు నీతిధర్మములకు విరుద్ధముగ వర్తించుచున్నారు. దీనికి ఫలిత మాజాతియే శీఘ్రముగ నాశనముజెందును. డార్వినుగారు తెలిపినట్లు హీనజంతువులలోనయిత మీ నీతిబీజముండును. మిగుల పిరికిజంతువులు నయితము తమపిల్లల కొరకు తమ జీవితములకు భంగమువచ్చినను శత్రువు నెదిరించి నిలచి వానిరక్షింప యత్నించుచుండు ననుటయె పయి దానికి ఋజువగును. నిశ్చయముగ సర్వజంతువు లానీతిశాసనమునకు సమానముగ బాధ్యతగలిగియుండనియెడల జీవనములన్నియు నాశనములగును. ప్రపంచికమంతయు నెడరిగ నూరును. తన నీతిజ్ఞానము హీనజంతుజాలమునందుకంటె తీవ్రముగను, నున్నతముగను నభివృద్ధిగాంచి యుండెననెడును—స్వకుటుంబముకొరకును, స్వసంఘముకొరకును, స్వదేశముకొరకొను, తన జీవితమును బలియొసఁగ శక్తుఁడుగ నున్నాడనెడు హేతువులవయిని మానుషాధిక్య మానుకొనియున్నది. అర్హతమములె నిలచుననెడు డార్వినుగారి సిద్ధాంతము ననుసరించి సహితము మనుజుఁడు తనకర్మలన్నిటియందును నైతికోద్దేశములచే నడపఁబడుటకు బాధ్యుఁడయియున్నాడని మనము తెలిసికొనుచున్నారము. మానవాధిక్యత ధనసంచయములను గాని, నాశనయోగ్యా

యుధములనుగాని, యానుకొని యుండలేదు. కాని కేవలస న్మార్గవర్ణనమందును ఋజుభావమందును నున్నది.

## నీతి-లోకసంగ్రహము

ఇదివరకు తెలిసినదానిని బట్టి లోకక్షేమము, నీతిమార్గావలంబనము నన్యోన్య మత్యంతసంబంధముకలవని తేలుచున్నది. ప్రేమ, ధర్మము, కృతజ్ఞత, దేశభక్తి, మొదలగుసద్గుణములన్నియు లోకోపకారఫలప్రదములుగ నున్నవి. నిజముగ నొకానొక మనుజుని ప్రత్యేకక్షేమసంపాదనమాత్రమున తృప్తి గాంచునట్టియు నొక్కమనుజుని క్షేమము కొఱకుద్దేశించు నట్టియు ధర్మమెద్దియు నుండదు. ఇందుకు విరుద్ధముగ ప్రత్యక్షముననో పరోక్షముననో దుష్కార్యకర్తతోపాటితరుల ననేకుల బాధించని యధర్మమెద్దియును నుండదు. కావున నెవఁడుగాని యోగ్యుఁడా? యయోగ్యుఁడా? యనువిషయము కేవలమాతనిని సంబంధించినదెగాక సంఘమంతకును యింకను ప్రపంచమంతకును సంబంధించియుండును.

ఎవఁడయిన నొకజనసంఘమును కట్టుబాటుచేయుశాసనములను, ఆచారములను వర్జించి, యా సంఘమును విడిచి జీవించునపుడు సహితము వానిచర్య తోడివారి కాదర్శకము కాకమానదు. ఏలనన భావప్రపంచము దిక్కాలోద్యవధులు లేకున్నది. ఒకయాచారముతప్పని యేరికయిన దృఢవిశ్వాసము

కలుగునప్పుడు తమ యభిప్రాయములను యితరులామోదించి నను లేకున్నను ఆతఁడు దాని నతిక్రమింపవలెను. తనకు తప్పని తోఁచినదానిని తొలుత విసర్జించి పిమ్మట యితరులకు తన భావనల బోధించి వారలను తనయుద్దేశమునకు మరలించుట వాని ప్రథమకర్తవ్యముగ నున్నది. ఎల్లమహావీరులును, మహర్షులును నవతారపురుషులును నీ రకమువారుగ నున్నారు. వారి విశుద్ధ నిష్కాపట్యముచేతను నిర్భయమగు యథార్థావలంబనముచేతను, మానవ మనోభావవీధుల ననేకసంస్కారణముల జేసిరి.

మనుజుఁడు తాను స్వప్రయోజనపరుఁడుగను నితరుల కష్టసుఖముల నాలోచింపనివాడుగను నుండునంతకాల మతఁడు పశుప్రకంటెను హీనుఁడుగ నుండును. తన కుటుంబక్షేమమునకై పాటుపడసాగినపుడు పశుత్వమును విడనాడును. తనసంఘమంతను గాని తన జాతినంతనుగాని స్వకుటుంబముగఁ జూడసాగినపుడింకను నున్నతపదవిని గాంచును. అనాగరికులనఁబడు జాతులను గూడ స్వకుటుంబమువారుగ నాదరించ మొదలిడునపు డింకను మహోన్నతస్థానమును గాంచును. తనతోడివాటి జనుల క్షేమమునకయి యెంతవరకు పాటుపడుచుందురో దాని ననుసరించి మనుజులుఘనత జెందుదురు.

మన తోడిమనుజుల నెల్లరిని మనము సానుభూతితోడను, దయతోడను జూడకుందుదనుక మనము నీతిధర్మావగాహనుల మయితి మన జాలకుందుము. మహోన్నతనీతి సార్వత్రికమయి యున్నది. మన సోదరులలో బ్రతివాడును మన సేవను గాంచ స్వతంత్రము కలిగియున్నాడని మరువక సాధ్యమగునం

తలో నెల్లవిధముల భక్తియుక్తమగు లోకసేవ గావింపవలెను. తమకు మాత్రమే తా ముత్తరవాదుల మనుకొనువా రుత్తమ శీలురు కానేరరు. తినన్వప్రయోజనమును, సంరక్షించుకొన జాలని మనుజుఁడు సంసారరణరంగమున బరాజితుఁ డగునను కొనుట బుద్ధిహీనమును నపాయకరమునునగు యుద్దేశముగ మన్నది. నిష్కల్మషహృదయులయి తదేకదీక్షతో బరోపకార పరాయణులగు వారిని దైవమెన్నఁడును విడనాడడు.

నీతిధర్మమున కందరేక రీతిని బద్ధులగుటచే మానవజా త్యైకత తెలియుచున్నది. జనులందరు దైవదృష్టిలో సమానులే. కాని జాతి, స్థితి, మొదలగు భేదములున్నవి. మానవునకు స్థితి హెచ్చినకొలఁది బాధ్యతలు హెచ్చుచుండును. మన మున్నత పదము నాక్రమింప దటస్థించునపుడు మనయాధిక్యతలనుగూర్చి బడాయిచెప్పుకొనరాదు. మనకంటె నధమదశయందున్న వారిని నిరసించరాదు. వారు వారికర్మల నెట్లాచరించుకొందురో మన మును మనకార్యముల నట్లే చేసికొందుము. మానవక్షేమ మను సామాన్యోద్దేశమునకయి యందరు పాటుపడుచున్నారు. ఇందుకు విరుద్ధాలోచనము గావించునంతదనుక మనము నీతి మార్గప్రవర్తకుల మనఁబడజాలము.

ఒకజాతివారు తమయాత్మలాభమునకై మఱియొకజాతి పయి నధికారముచెల్లించుట నీతిధర్మవిరుద్ధమని దీనివలన తేలుచున్నది. చక్కని యభివృద్ధిగాంచిన యొకజాతీయు లంత బాగుగ నభివృద్ధినందని జనులపయి నధికారము చెల్లింపదటస్థ మగుచో దానిప్రజల తమతో సమానాభివృద్ధిని కలుగజేయు

టకుగాను సద్వప్రియత్నములగావించుట యీజాతియొక్క ప్రథానవిధియై యున్నది. మరియు నప్పుడు నీతిధర్మానుసార మొకరాజు యేమార్గముచేతను తనప్రజలకంటె నధికుఁడనని యెంచుకొనగూడదు. ఏలన నిశ్చయముగ నతఁడు జనులసేవక మాత్రుఁడయి యున్నాడు. అధికారులు నిజాధికారబలమును తమతోడి జనులక్షేమమునకై వినియోగపరచవలెను. నైతికపు నాదిబద్ధము కానట్టియు స్వలాభాయత్తులుగాని స్త్రీపు రుషులతోగూడి యుండునట్టియు నొక ప్రజాప్రభుత్వము నిరం కుశప్రభుత్వముకంటెను హాడుగనుండును.

ఒకసంఘమందుగాని, జాతియందుగాని, బలవంతులు బలహీనులును, నార్తులను రక్షించుట తమవిధ్యుక్తధర్మము లలో నత్యావశ్యకమయినదిగ నెంచుకొనవలెను. అందరు మనుజులును నుపకారబాధ్యతయొక్క సత్యమును గ్రహించి రేని ధనసంచయముల గూర్చుట పాతకమని వారెంతురు. అప్పు డైశ్వర్యములో నసమానతలుండవు. అందుచే క్షామోపవాస ములుండవు. ధర్మమార్గచరులు, ప్రపంచమున ధర్మ మత్యల్ప ముగ నున్నదనియు, తా మత్యల్పసంఖ్యాకులమయి యున్నార మనియు యోచించి యట్టియోచనలవలన నధైర్యమును జెందరాదు. మంచి నాచరించుచు మిగత దేవునిపయి విడుచు టయె వారి విధ్యుక్తధర్మము. వారు తమకర్మలఫలమును గూర్చి యెన్నఁడును దలంచరాదు. బాగుగ నొనర్చిన కార్య ఫలమది జరుగుటయు బాగుగజేసిన కార్యానందము దానిని జక్కగ నెరవేర్చుటయందె యుండును.

---

# ఉ ప స ం హా ర ము

ప్రతి మనుజుఁడును తాను నిర్వహింపవలసిన ధర్మము లను, బాధ్యతలను, కలిగియున్నాఁడు. అతఁడు తన చెవులలో నొక నిశ్చలమగు చిన్నధ్వని యిట్లనుచుంటను వినుచుండును. "ఇది నీపని, నీవిధ్యుక్తకర్మము. నీ జయాపజయములకు నీవే యుత్తరవాదివిగ నుందువు. ఏలన నీవే నిన్ను పోలియున్నవాఁడవు. సరిగా నొకపోల్కఁగల రెండువస్తువుల బ్రకృతి యెన్నఁడును సృష్టించదు. కావున నీవిధిని నీవే నెరవేర్పనియెడల నొరులెవ్వరు దాని నెరవేర్పజాలరు. అది యెన్నటికిని పూర్తిగాకుండ నుండి పోవును."

మన మిదివరకు యోచించినటుల స్వప్రయోజనరహితముగ పరోపకారము చేయుటయె మనుష్యుని విధియయి యున్నది. మఱియు నొరులకు మేలుచేయుట కొరకనియెగాక తనప్రకృతిధర్మ మదిగాన చేయుచుంటినని యట్టిపనుల జేయవలెను. ఆత్మబాధకకర్మములలో మనయిష్టప్రకారము వర్తింప సమర్థతకలదని తెలుపుజనులు కొందరుగలరు. కాని నిశ్చయముగ ప్రత్యక్షముగనో పరోక్షముగనో తనతోడి మానవులు క్షేమమునకు సంపర్కము లేనట్టియు యీ ప్రపంచమున యేపనిని యే నరుఁడును చేయఁజాలఁడు. ఎంత నిగూఢములగు మనోభావములేని తనయందును, నితరులయందును ప్రభావము కలవని యెల్లరు గ్రహించవలెను. కావున తన మనంబుననుండి దుశ్చింతనల దొలగించి ఘనతర మహాశయములకు తా వొసఁగు

వట్లాత్మనిగ్రహము నభ్యాసము చేసికొనవలెను. అతఁడు తన శరీరమును తనమనస్సువలెనే నిర్మాలిన్యముగను, పరిశుభ్రము గను నుంచుకొనవలెను. మనుష్యుఁడు నిజమనోభావభావితుఁడగును. తానెట్లు తలంచిన నట్లగును. కావున దురాచరణవికార హేతువుల దృఢముగ నణచవలెను. జితేంద్రియుఁడును నాత్మయందుస్వరాజ్యానుభవహీనుఁడును, యేమేలును పొందనేరఁడు.

తన మనమును నిర్మాలిన్యముగను, పవిత్రముగను, నుంచికొననేర్చినవాఁడు తన జీవితాదర్శమును గూర్చిన విస్పష్టముగు యోచననుగూడ గలిగియుండవలెను. తన జీవితాదర్శముగు పురుషార్థమునుగూర్చి వ్యవసాయాత్మికబుద్ధిలేని మనుజుని జీవయాత్రశక్తి చుక్కానిలేని పడవ సముద్రమధ్యమున కల్లోలాఘాతమున తుదకు నాశనమొందినట్లు బహుశాఖాన్వితమయి తుదకు నశించును. దైవారాధనమె సర్వోత్కృష్టకర్మము. నైతికధర్మనిష్ఠాగరిష్టతవలనను నిష్కామ్యపరోపకారపారీణత వలనను నగు భగవత్కార్మాచరణమె సర్వోత్కృష్టారాధనవిధానముగ నున్నది.

పతితులును దుష్టులును వేనవేలు వ్యర్థముగ భగవన్నామోచ్చారణము గావించుచుందురు. చిలుకను భగవన్నామోచ్చారణము గావించునట్లు చేయుగలము. కాని యది దైవభక్తి కలదనియు, పవిత్రమయినదనియు, జెప్పగలమా? సర్వజనుల సర్వకాలావస్థలయందును, పరోపకారము జేయువీలుండును. మానుషసేవయే తన జీవితమున కత్యున్నతాదర్శకమని భావిం

... ...గుజాలఁడు. ఏలనన వ్రిపంచ

క్షేమము నీతిధర్మాచరణమున కత్యంతసన్నిహితసంబంధము కలిగియున్నది.

మనుష్యుల కర్మల విమర్శనములలో ప్రాపంచిక క్షేమమున కాకర్మసహకారియగునా లేదా యనువిషయము శోధనీయవిషయము. వర్తకుడు తన ఖాతాదారుల నష్టపరచి తాను లాభముపొంద యత్నించరాదు. న్యాయవాదులు వైద్యులును తమ యార్జనయే ప్రధానముగ నెంచుకొనక ప్రజలక్షేమము నెక్కుడుగ చూడవలెను. తల్లి పుత్రిమోహముచేగాని యితర కారణములచేగాని తన బిడ్డల పాడుచేయకుండ ననిశము జాగరూకతకలిగి యుండవలెను. నింద్యకర్మలచే విశేషద్రవ్యసంపాదనగావించిన వర్తకుడు, న్యాయవాది, వైద్యుడు యీముగ్గురెంత తెలివితేటలు కలిగియుండినను వీరికంటె విద్యాగంధశూన్యుడగు కూలివాడె విశేషఘనుడు. ఏయిన్యాయపద్ధతి ననుసరించి యెంత యధమాధముడయినను, తన జీవయాత్రగడుపుకొనగలడని మన మెన్నడును మఱవరాదు. ధనలేమివలనగాని, తక్కువస్థితియందునికివలనగాని యెంతస్వల్పునికయినను, నీతిమార్గానుసరణమునకు భంగము కలుగనేరదు. ఏలనన మనుష్యుని ఘనత జాతినిగాని ధనమునుగాని యాధారముచేసికొని యుండలేదు. కాని యది కేవలము వారి ప్రవర్తనయందును జీవయాత్రనడపువిధమునందును నాధారమైయుండును. ఏమనుజుని యోగ్యతనుగాని విమర్శించునపుడు వాని హృదయాంతర్గతభావములనె మనము తెలిసికొనవలెను. ఒకమనుష్యు డొక యాచకునకు వానిని తన యెదుటినుండి తొలగించుటకుగానొక

రూప్యమొసఁగవచ్చును. మఱియొకఁడా యాచకుని దుస్థితికి వగచి కనికరించి ప్రేమచే నొక పావలావరాత్రి మిచ్చియుండును. ఈ యిరువురిలో ద్వితీయుఁడు, ప్రథమునికంటె కొంచెమిచ్చియున్నను, మిగుల ఘనతరుఁడు స్పష్టముగ నగుచున్నాఁడు.

ఇందు నిష్కర్షగ నసూయాస్వార్థపరతలచే కళంకితదూరమయిన హృదయముకలవాఁడును, కేవలపవిత్రజీవితుఁడును, నిష్కామ్యకర్మాచరణచణుండును, నిజమగు దైవభక్తుఁడును నీతికోవిదుఁడునని చెప్పనొప్పును. మఱియు నతఁడు ధనికుఁడును సుఖియు ననిగూడఁ జెప్పనగును. అట్టివారలె లోకసంగ్రహమును గావింప సమర్థులు. ఏలనన సకలవిధములగు యోగ్యతలకును ఘనతకును సత్యమె యాధారముగ నున్నది. నిజమగు మానవసేవాపరాయణున కాసేవ యే రూపమున నుండవలెనో యనుప్రశ్నయే పుట్టనేరదు. నీతిధర్మముయొక్క మహాత్మ్యమును మనము గ్రహించినపుడు మన యారోగ్యము, జయము, కీర్తి మొదలగువానిపయిని మన సుఖదుఃఖము లాధారపడియుండలేదని గ్రహింతుము. ఎమర్సను మహాశయుఁ డందముగ దెలిపియున్నటుల సత్పురుషుల దుఃఖములును బాధలును వారికి సుఖదాయకములై యగుచున్నవి. దురాత్ముల కీర్తివైభవములు వారికిగాక ప్రపంచకమునకు దుఃఖహేతువు లగుచున్నవి. మొదట దైవసామ్రాజ్యమును తన్నీతిమార్గమును కనుగొనుము. పిమ్మట సమస్తమును నీవే పొందగలవు.

# ప్రకటన.

| | |
|---|---|
| కర్మయోగము (వివేకానంద ప్రణీతము) | 1- 0-0 |
| భారతయోధులు (చరిత్రలు) | 1- 0-0 |
| శ్రీమద్రామాయణసారము (వచనము) | 1- 3-0 |
| పాపారాయ నిర్యాణము (నాటకము) | 1- 0-0 |
| అర్జున పరాభవము (నాటకము) | 0-10-0 |
| స్వారాజ్యధ్వజము (నాటకము) | 0-12-0 |
| సేవావ్రత మహిమ | 0- 2-0 |
| కేవరు ప్రభాని చరిత్ర | 0- 6-0 |
| మహారాష్ట్ర వీరులు | 0- 6-0 |
| వనదుర్గము (నవల) | 1- 0-0 |
| మనోరమాజయసేనము (నాటకము) | 0- 8-0 |
| స్వామి దయానందసరస్వతి సంపూర్ణ చరిత్ర-యుపదేశములు | 1- 8 0 |
| కవిత్వ తత్వము (ఛందస్సు) | 0- 8-0 |
| ఉపనిషత్సార ధర్మోపదేశములు మహర్షి దేవేంద్రనాథ ఠాకూరు | 0- 8-0 |
| మానసింగు (నవల) | 1- 0-0 |
| కాళిక (నవల) | 1- 0-0 |
| ఆరోగ్య మార్గబోధిని | 0-8 -0 |

| | |
|---|---|
| ప్రచండభైరవము (నవల) | 0- 8-0 |
| వసుంధర (నవల) | 1- 0-0 |
| గాంధి నీతిధర్మము (తెనుగు) | 0- 4-0 |
| రాజయోగసాధన | 1- 0-0 |

# అచ్చులోనున్న గ్రంథములు

---

1. ఆంధ్ర మాతృము
2. గాంధిమహాత్ముని సంపూర్ణ ఉపన్యాసములు
3. మాలపల్లి
4. భీమప్రతిజ్ఞ (నాటకము)

వలయువారు ఇట్లు వ్రాయవలయును.

ఆంధ్రపరిషత్తు, బెజవాడ.

---

